# ప్రతాపరుద్రీయము

అను యుగంధర విజయము.

గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావు.







ప్రకాశకుడు:

కురుకూరి సుబ్బారావు,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్,

భీమడోలు, (పశ్చిమగోదావరిజిల్లా)

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

(కాపీరైటు) 1926 (వెల 1-4-0)

# ఆంధ్ర నాటకములు.

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| ఊర్వశీశాపవిమోచనము అ॥ సు॥ | 1 | 0 | కళలత నాటకం పి॥ సు॥ | 0 | 12 |
| జయచంద్రచంద్రరేఖావిజయము | 0 | 10 | సారంగధర డిటో | 0 | 12 |
| పసన్బకావళి | 1 | 0 | సంపూర్ణోత్తరరామాయణము రా॥ సా॥ | 1 | 4 |
| గులేబకావళి | 1 | 0 | సుమతీజేని బ॥ కో॥ | 0 | 12 |
| శ్రీకృష్ణవిలాసము | 0 | 12 | హనుమద్రామసంగ్రామము | 0 | 12 |
| గర్వభంగము | 0 | 10 | లక్ష్మణ మూర్ఛ సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీరామాంజనేయము పి॥ చి॥ | 1 | 0 | శకుంతల సో॥ రా॥ | 0 | 12 |
| సంపూర్ణభాగవతము శే॥ రా॥ | 0 | 12 | దాన వీరకర్ణ డిటో | 1 | 0 |
| శ్రీకృష్ణదేవరాయవిజయము | 0 | 12 | సంగీత గులేబకావళి చ॥ మా॥ | 1 | 0 |
| పాలాక్షి విజయనగర్ | 0 | 12 | పాండవ అజ్ఞాతవాసము దో॥ సీ॥ | 0 | 8 |
| విజయభాస్కరము జ॥ ల॥ | 1 | 0 | చనుకచంద్రహాస డిటో | 0 | 8 |
| ప్రభాకర డిటో | 0 | 8 | సీష్వ నారాయణరావు | 0 | 10 |
| శారదావిజయం కో॥ స॥ | 0 | 12 | రాయమహాత్ మట్టుపి | 0 | 10 |
| చంద్రకాంత డిటో | 0 | 12 | శ్రీరామజననము | 0 | 8 |
| నవనంద డిటో | 0 | 12 | శ్రీరామ ప్రవాసము | 0 | 8 |
| కబీర్ దాసీయము శే॥ రా॥ | 0 | 12 | శ్రీరామోద్యోగము | 0 | 8 |
| మాలతీ మధుకరము బ॥ స్వా॥ | 1 | 0 | శ్రీరామ విజయము | 0 | 8 |
| స్త్రీసాహసము వెం॥ వెం॥ | 0 | 10 | శ్రీరామాశ్వమేధము | 0 | 8 |
| సత్యహరిశ్చంద్ర కా॥ వీ॥ | 0 | 12 | వైదర్భీవిలాసము | 0 | 12 |
| సంగీతసావిత్రి చ॥ మా॥ | 1 | 0 | ఆంధ్ర పతాకము | 0 | 12 |
| సత్యహరిశ్చంద్ర డిటో | 1 | 0 | సంసారిణి దా॥ పు॥ | 1 | 0 |
| సంగీత ప్రహ్లాద డిటో | 0 | 12 | రుక్మిణీ పరిణయం గం॥ శే॥ | 1 | 0 |
| సంగీత స్త్రీసాహసము | 0 | 12 | సీతాకళ్యాణము బ॥ సీ॥ | 0 | 8 |
| పద్మవ్యూహము | 1 | 0 | సంగీత విష్ణులీల చ॥ మా॥ | 1 | 0 |
| కృష్ణ రాయబారము | 0 | 12 | చిత్రనళీయము నా॥ సు॥ | 1 | 4 |
| చిత్రనళీయము | 1 | 4 | తపతీ సంవరణము కా॥ కో॥ | 0 | 12 |
| లవకుశ నా॥ సు॥ | 1 | 0 | సుగర్ణపాత్రి రా॥ నా॥ | 1 | 0 |
| రాధాకృష్ణ డిటో | 1 | 0 | సుగ్రీవ పట్టాభిషేకం సో॥ రా॥ | 0 | 12 |
| వరవిక్రయము డిటో | 1 | 0 | సీతాకళ్యాణము డిటో | 0 | 12 |
| భక్త తుకారాము తా॥ వెం॥ | 1 | 0 | శ్రీరామ జననము డిటో | 0 | 12 |

వెలయు చోట :— కొడుకుల సుబ్బారావు,

బుక్ సెల్లరు అండ్ పబ్లిషర్, భీమవరం, పశ్చిమ గోదావరి జి॥

శ్రీ

# ప్రతాపరుద్రీయము

## అను యుగంధర విజయము

[ఆఱంకముల నాటకము.]

ఇది

శ్రీ భద్రాచలపురవాసియు,

స్వరాజ్యరథము, సతీ అనసూయా, అలీబాబా, తాజ్‌మహాల్, గానవీరకన్య మొదలగు ననేక నాటకములు రచించిన

శ్రీయుత


సోమరాజు రామానుజరావుగారిచే


రచియింపఁబడినది




ప్రకాశకుఁడు:

కురుకూరి సుబ్బారావు,

బుక్‌సెల్లర్ & పబ్లిషర్, భీమవోలు,

పశ్చిమగోదావరిజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.



రిజిష్టర్డుకాపీరైటు.]



1926

[వెల 1-4-0

# ఇందలి పాత్రలు

—: పురుషులు :—

1. ప్రతాపరుద్రుఁడు
2. యుగంధరుఁడు
3. వెఱ్ఱివాఁడు
4. జనార్దనుఁడు
5. విద్యానాథుఁడు
6 చెకుముకిశాస్త్రి
7. పేరిగాఁడు
8 ఢిల్లీసుల్తాను
9. వలీఖాన్
10. మసూరిఖాన్
11. ముస్తఫాఖాన్
12 ఫిరోజుఖాన్
13. విశ్వాసరావు
14. పడవవాండ్రు
15. సిపాయీలు
16. వెఱ్ఱివాని శిష్యులు
17. వర్తకులు
18. పీరిశెట్టి

19. దళిష్టలు
20. యువరాజు

—: స్త్రీలు :—

1. మున్నుడమ్మ
2. భవానిదేవి
3. శ్యామల
4. దరియాబీబీ
5. ఫాతిమాబీబీ





శ్రీ

# ప్రతాపరుద్రీయము.

## ప్రథమాంకము.



ప్రదేశము:—గోదావరీతీరమునందలి యడవి.

[ప్రవేశము:—క్రోధయుక్తుఁడై చెకుముకిశాస్త్రి.]

చెకు—(ఆగ్రహముతో కత్తిదూసి) ఓరీ గోఘ్నబాంధవులారా! మ్లేచ్ఛపాతకులారా!

శా. ఓ పాపాత్మకులార! దేశహరణోద్యోగానుసంధానవి
ద్యాపారంగతులౌచు, రాష్ట్రమున వాత్మర్ద్యోగ పావనే
చ్ఛాపారాయణులైన మీకుఁ గీడం బాప్ప నున్నాఁడ! మీ
పాపంపుందల ఖడ్గధార నేలఁ బడ వ్యాపారంబుఁ జేకూర్చెదన్.

దుష్టులారా! నికృష్టులారా! భరతఖండం బెవ్వరి తాతసొమ్మని తలపోసి యథేచ్ఛావ్యాపారంబున రాజ్యమఖండము శాశ్వతముగ నేలుకొనఁ దలఁచితిరి! మ్లేచ్ఛాధములరగు మీస్వాతంత్ర్యంబునకుఁ దల యొగ్గి పారతంత్ర్యపిశాచదాసులమై మీబానిసల మైనను, మీయాగడము శాశ్వతంబు మాపై సాగింపక వదల రైతిరా!

సీ. అన్యాయబద్ధరాజ్యాక్రమణంబు మా
యింపఁగ మిమ్ము వారింపలేము
భరతసామ్రాజ్యంబుఁ బాలింపఁగా సిద్ధ
మైసంగాలకు సీర్ష్య నందలేము
హైందవమతదూషణారంభులైన మీ
శిరము లుగ్రాసినిఁ దఱుగలేము
పలుమారు శివలింగములఁ గూలఁ దన్నిన
పాదముల్ గదలచే మోదలేము
భారతీయస్వరాజ్య మర్పణము జేసి
దాస్య మొనరించి, మీపాదతలములందు
శిరము లుంచిననైన దుశ్చేష్టులార!
క్రూరదౌర్జన్యపాలన మాఱలేదె?

నన్ను మీరు పరిభవించి ఢిల్లీపురమునుండి సాగఁదోలినందులకు శీఘ్రకాలంబునఁ బ్రతిఫలం బనుభవింపనున్నారు! హిందువులు కాలవైపరీత్యంబున నైకమత్యంబు చెడి దుర్దశాపరిణామంబుగ పారతంత్ర్యంబునఁ జిక్కియుండ పరదేశవాసుల కింత కన్నులు తలకెక్కె! కానిండు! సర్వపాపంబులకుఁ బ్రతిఫలం బొక్కసారిగ ననుభూతంబు కాఁగలదు.

సీ. తులువవై సోమనాథుని విగ్రహంబును
దునియలు జేసినదురితఫలము
కాశికానిలయవిశ్వేశలింగంబును
గాలఁ దన్నినయట్టికలుషఫలము
పుస్తకభాండారముల కగ్గిఁ దగిలించి
కాల్చిన ఘోరదుష్కర్మఫలము

ఘోరాసిధారను గోబ్రాహ్మణులఁ గొట్టి
పరిభవించినయట్టి పాపఫలము
విడువఁబోవదు మిమ్ముఁ గట్టి కుడుపకుండ,
భారతీయుల దార్ఢ్య పాలనమున
నేలునధికార మింక నట్టేటఁ గలియు
కాల మేతెంచె మ్లేచ్ఛదుష్కర్ములార!

(ఆలోచించి) ఏమిది! నేను కార్యాలోచనం బొనరింపక ప్రకృతంబు మఱచి యసమయనిర్వేదంబు పాలగుచున్నవాఁడను. ఇప్పుడు నే నెందుఁబోవుదును? ఏది కార్యవిధానము! లోకంబులను యుక్తి ప్రయుక్తిమాత్రంబునఁ దలక్రిందులు సేయఁజాలు నీచెకుముకికా పరాభవము?

క. నేనే చెకుముకి నేని, కృ
పాణం బవసరము లేని బహుళోపాయా
నూనప్రావీణ్యంబునఁ,
బ్రాణంబులఁ దీతుఁ దురకరాజులదంపున్.

[తరువాత పుస్తకము చేతఁబట్టుకొని విద్యానాథుఁడు ప్రవేశము.]

విద్యా — (స్వగ) తగినపతి లభింపనప్పుడు కావ్యబాలం గన్న కవిజనకుని దుఃఖమునకు మేరయుండదు గదా!

శ్లో॥ "బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవః స్మయదూషితాః
అబోధోపహతాశ్చాన్యే
జీర్ణమఙ్గేసుభాషితం॥"

పండితపోషకుం డనియు, సరసగీర్వాణకవితాప్రౌఢుం డనియుఁ, బ్రసిద్ధి వడసిన శ్రీమత్కాకతీయప్రతాపరుద్రగణపతిమహారాజునకుం గృతిగా రచించిన నా యీమహాకావ్యంబునకు రాజసన్మా

సంబు లభించు పుణ్యకాలం బెప్పుడు సమకూరునో యెఱుంగ
రాదయ్యె!—కానిమ్ము; ఈప్రయత్నంబు సఫలంబు గాకుం
డునా!

శా. "ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్నసహస్రమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ! ప్రజ్ఞానిధుల్ గావునన్."

అనికదా పెద్దల తాత్పర్యము. (నడుచుచున్నాఁడు.)

చరు—మజ్జన్మదేశం బగు నాంధ్రదిగాతలంబు నిప్పుడు కాకతీయప్రతాపరుద్రగణపతి పరిపాలించుచున్నాఁడు అచ్చటి కరిగెదఁ గాక! తత్సహాయంబున నే నందిన యవమానంబు నశింపఁగలదు. ఆయన పరివారం బంతయు శౌర్యోపేతం బని వింటిని.

సీ. తతరాజ్యతంత్రము ల్దక్రిందలుగ సేయు
మహితయుగంధరామాత్యవరుఁడు,
తత్సహోదరుఁడు తంత్రజ్ఞుండు సోదరు
నకుఁ గ్రిందుగాని జనార్దనుండు,
రిపుదళారణ్యదావాపరీతవహ్ని—చే
తాళరాయఁ డరాతికాలమూర్తి
వ్యవహారదక్షుఁ డత్యంతమేధావి, వి
శ్వాసపాత్రుండు విశ్వాసరావు—
తెన్న బలసి కొలువ ధన్యుఁడై కాకతీ
యప్రతాపవహ్ని యారకుండఁ,
బాలనంబు సేయు ప్రభువర్యుఁడు ప్రతాప
రుద్రమూర్తి కాలరుద్రమూర్తి.

విద్యా— (ఆలకించి) "ప్రతాపరుద్రమూర్తి కాలరుద్రమూర్తి"

సాధు! ఆగంతుకా! సాధు!!—భవత్ప్రతాపరుద్రసామ్రాజ్యా
భివర్ణనము సమంజసముగ నున్నది. కాకతీయప్రతాపరుద్ర
గణపతిదేవునకు శుభం బగుఁగాక!—ఎవ్వరీ రాజాన్వేషి!—
ఈతఁడును నా యెక్కినయోడ నెక్కినవాఁడే!—కానిమ్ము—
యుక్తమయ్యెనేని రాజదర్శనంబునకుఁ గలసియే పోవచ్చును.

చెకు—(స్వ) ప్రతాపరుద్రపరిపాలితం బోరుగంటినగరము—మార్గ
ము నాకు దురవగాహము—ఎట్లు పోవనగును? (ఎదుటఁ బరి
కించి) ఎవ్వరో మహానుభావులు—ముఖవర్చస్సునుఁ బట్టిచూడ
పండితశ్రేష్ఠుఁ డని భావింపఁదగియున్నది. పలుకరించెదఁగాక!—
(ఆలోచించి) పలుకరించుటగాదు. పండితులు వందనార్హులు—
(ప్రకా) విద్యానిధి కభివాదనము!

విద్యా—విద్యానిధి నగుట యేమోకాని విద్యానాథుఁడ నగుటమా
త్రము నిజము

చెకు—సందేహమేమి? తమరు కేవల మావిద్యానాథులరే! కాని
చో నింతటి బ్రహ్మవర్చస్సు ముఖకమలమున నెట్లుగలుగు?

విద్యా—అయ్యా! మీరు విశేషముగ నన్నుఁ బ్రశంసించుచున్నారు.
అది నాతల్లిదండ్రులు పెట్టినపేరు.

చెకు—అగుఁగాక—

కం. ఆ తేజ మామహత్త్వం
బాతారుణ్యం బనాగతాగతవేద్య
స్థితియు విద్యానాథున
కే తగు తమకే తగున్ మహీసురనాథా!

విద్యా—నాయనా!

ఉ. దేశము పారతంత్ర్యమునఁ దేలెడునప్పుడు సంతతాగమా
భ్యాసముచేతఁ గాని తగుపాండితిచేతనుఁ గాని, కల్గునే

పీనముశాంలి; తాదృశ, సువిక్రమబాహుల దీప్తిఁగాక తా
రాశిగ చింతకాయ లిల రాలునె భీమణశాపకోటికిఁ?

చెకు—అట్లయిన, తమరు కేవలము ఛాందసమునఁ గాక లౌక్యమునఁ
గూడ ప్రవీణులా?

విద్యా—కత్తిఁబట్టజాలఁ గాని భగవదనుగ్రహమున కవనతంత్ర మెంత
ధారాళమో రాజ్యతంత్రమునయితము నాకంత ధారాళము—

చెకు—భరతమాతకడుపున సుపుత్రులై జన్మించితిరి! అట్లైనఁ దమ
గమ్యస్థాన మేది?

విద్యా—ఓరుగంటి శ్రీకాకతీయప్రతాపరుద్రగణపతి కంకితముగఁ
బ్రతాపరుద్రీయ మనుకావ్యమును రచించితిని. దీని నారసజ్ఞ
శేఖరున కంకితము చేయఁబోవుచున్నాను.

చెకు—మహాత్మా! పరమేశ్వరుఁడు నా కనుకూలుఁడయ్యె!—నడు
వుఁడు. తోడులేక నేనుసయితమయ్యెడకే చనుచుంటిని.

విద్యా—నాయనా!—విప్రుండవయ్యు నిరుపమానశూరాకారమును
దాల్చి, పరశురామావతారమువలె నున్న నీయుదంతమును
నే నెఱుంగవచ్చునా?

చెకు—మహాత్మా! నడువుఁడు—మార్గమధ్యంబున సర్వంబు నెఱిం
గించెద.

విద్యా—అట్లే కానిమ్ము—సాయంకాలము గావచ్చినది. నేఁటికి మన
మొకసమీపగ్రామమున విశ్రాంతి నందుట మంచిది. చూడు
ము ప్రకృతి యెంతవిలాసముగ నున్నదో!

సీ. పశ్చిమశైలాధిపతిఁ బట్టి బంధింప,
నరుగుచు నున్న చండాంశుఁ డదిగొ!
నాల్గుజాములలోన నారాజుఁ గొనివత్తు
నని యేగుసాంధ్యరాగాళి యదిగొ!

జనా—(పట్టుకొని) యువరాజా! నామాట వినుము. ఇది పరాక్రమ
మునకు సమయము కాదు.

యువ—ఇంతకన్నఁ బరాక్రమమునకు సమయ మింకొకటి వేఱు గాఁ
గలదా?

గీ. చుట్టి తురకలు పురమును ముట్టడించి
కోట నవలీలఁ గబళింపఁ గోరుచుండ—
రణము సిద్ధ మైయుండఁ బరాక్రమమున
కిపుడు సమయము గాక వేఱెపుడు గలుగు?

జనా—నాయనా! అది నిజమే కాని—తురకలు వచ్చి మనపురమును
ముట్టడించినంతమాత్రమున నిప్పుడు మనకు వచ్చినభయ మేమి
యును లేదు. సావధానముగనే కార్యము సాధింతుముగాక!

క. తురకలబలాబలము గన
మెఱుఁగక సాధ్యమును వహించుట హితమే?
[illegible]
బలిమార్తుముగా! శాంతి వడయుము కుమారా!

యువ—విమర్శనము గాంచి సమయజ్ఞుఁడనై శాంతించిన నది యుద
నెఱిఁగి కాలు వేయకుండునా! "ఆలస్యాదమృతంవిష" మనుట
తమ రెఱింగింపవలయునే?

చ. రయమున నేఁగి యాతురకసైన్యమును గీటడంచి వి
స్మయము మగంటిగా గనసి చాతురి సేతఁ జూపకున్న నా
వయసున కేమి సార్థకము? వారక సత్కులమందుఁ బుట్టనే?
భయ మది యేల, నాఁజులను బ్రాకుగఁ జేతులఁ దాల్చినాఁడనే?

జనా—నాయనా! ప్రతాపరుద్రమహీపాలునిగర్భవారాసిని నీయట్టి
వాఁడుగాక, పిఱికిపంద యెవ్వఁడైన నుదయించునా? ఇప్పుడు
వశీభావము బహిరంగముగ మనపైఁ బడ సాధించుట లేదు. కావున

మనమును వానియుద్దేశము నెఱిఁగియే ప్రవర్తింతము ఇప్పుడు వానిని బయటికి రప్పించితిని. మంత్రులెవ్వరుం గాంగమునఁ జేయు చేసి కొనకు. నీయుద్దేశమును ద్వారలోనే ఫలింపనున్నది ఇప్పటి కరుగుము

యువ—కానిమ్ము. మీరాయబారంబున కప్పటి కడ్డము రాను. కాని తురకలు మోసంబున విజృంభించిరా యువరాజు యవనరాజునకు యముఁడగునని యెఱుఁగుఁడు. (నిష్క్రమించును.)

జనా—(స్వగ) ఇప్పటికీయుద్రేక మణఁగినది. తరువాతపని చూతము. అన్నగారగుయుగంధరులవారు యాత్రకరుగుసమయమున నన్నుం బిలిచి—"తొమ్మిదిలక్షల విలుకాండ్రు రక్షించు రాజ్యమును రాజును, నీకప్పగించితిని. జాగరూకుఁడవై మెలంగు" మని పలికిరి. ఇప్పుడు క్లిష్టసమయము వచ్చినది. ఇట్టిసమయంబున నా ప్రజ్ఞావిశేషముం గనుపఱచి మెప్పొందవలయును—........చారులు వచించుటకును, నే నూహించుటకును సరిపోయినది. ఈవలీఖానుఁడు మంచి వేగుదృష్టితో వచ్చుచున్నవాఁడు. ఊహింపఁగా నిది దాడి యనుటకు సంశయము లేదు.

ఆ. పురవరమ్మునందు భూపుండు మంత్రియు
లేసి యదను వెదకి జాణతనము
మెఱయ నిటుల దాడి కరుదెంచి యున్నాఁడు
ఢిల్లిపురము నుండి వల్లిఖాను.

అనతికాలములో నాతఁ డిందు వచ్చును గదా! సర్వము నప్పుడు తెలియఁగలదు.

[భటుఁడు ప్రవేశము.]

భటు—జయము జయము స్వామీ!—

జనా—ఏమిరా విశేషము ?

భటు—వల్లీఖాను శిరస్తాతో వచ్చి దర్శన మపేక్షించి యున్నాఁడు.

జనా—సరే ! వారిద్దఱిని మాత్రము పంపుము.

భటు—(నిష్క్రమించును.)

[తరువాత- శిరస్తాతో వల్లీఖానుఁడు ప్రవేశించును.]

(అన్యోన్య మర్యాద లైనతరువాత)

-ఇం దాసీనులు గండు.

(అందఱు నాసీను లగుదురు.)

జనా—మీ గయాజుద్దీన్ టోఘుక్ సుల్తానువారికి సపరివారముగ క్షేమమా ?—

వలీ—మహామంత్రిల్ తను ఖిడ్మత్వుంచేత— అల్లా హానుగ్రహం చేత—వారూ అంతా క్షేమం. మీ రాజావారూ మీరు హాంతా కుషలమా !

జనా—మాకును గుశలమే—కాని,

ఉ. ఎక్కడి యోరుగంటిపుర ? మెక్కడి ఢిల్లిపురంబు ?—నేఁడు మీ
రిక్కడి కేగుదెంచుట, యహీనగుణాకర ! మాకుఁ జూడఁగా
నక్కజ మయ్యె; రాణువయు నంతయు నింతయు గాదు; దీనఁ బెం
పెక్కిన కారణంబు వచియింపుము మైత్రిని ఖానువన్యుఁడా!

వలీ—మేనువచ్చిన ఖారణం మహామంత్రు ల్వారీంగో వ్యాయంమస్వీచేసి మహారాజావా రీసహాయం పొందీ యెల్లవాలా వుంటాం—దాన్కీ షుభసూచకంగా తమరూ ముందూ హడ్డినాక్. ఇదీ మాకూ సాలా హానందం. మాషుల్తాన్ వారికీ—ఖాభూల్ నబాబ్కీ—షరిహద్దుల్కా-డా తఖరార్ వచ్చి-హాదీ-ఆస్తే ఆస్తే-పెర్గి. పెర్గి పెద్దదై- యిప్పుడు షమాచారం- నమ్మక్ హరాం గార్ లాగా చిటపటా చిటపటా లాడ్తుంది ఖాబూల్ సాయె

జనా—సరే కాని, మా మహారాజా వారిని సేనల వెంట రమ్మని కోరెద రేమి? మీ సరదా రనుకొంటిరా?

వలీ—అన్నగారూ! మా షుల్తాన్సాయా దోస్తీచేతా అలాగా చెప్పినార్—అదీ మీకూ హాగార్వం అని దిల్మేంతోస్తే సేనల్ పంపండి చాలు.

జనా—(స్వగ) రెండును చక్కని యెత్తుగడలే యెత్తినాఁడు. రాజును పంపినచో రాజునే సంహరింపవచ్చుననియు—సేనలను పంపినచో నిస్సహాయమగు కోటను పట్టవచ్చుననియు వీని సంకల్పము—ఈరెండు సంకల్పములను వికల్పములుగాఁ జేయవలయును. (ప్రకా) మంచిది. మహారాజావారి దర్శనము మీకు వారముదినములలోఁ గలుగఁజేసెదము—అంతవఱకు వేచి యుండుఁడు.

వలీ—వారంరోజులదాకా ఐతే మాకీ చాలా హాలస్యం ఔతుంది. రేపు ఎల్లుండిలోగా దర్శనం యిప్పిస్తే చాలా హనుకూలం వుంటుంది

జనా—(స్వగ) అన్నగారును—ప్రభువుగారును లేనిజాడ యెఱింగియే వచ్చెను—చతురుఁడగు నీతురక, వా రుండిరను నుద్దేశమున సదభిప్రాయముననే తాను వచ్చినట్లు తోఁచుట కిట్లనుచున్నాఁడు. ఇంకావలన సేమగును. (ప్రకా) ప్రభువువారు గ్రామాంతరమునం దున్నారు. వారు వచ్చినతోడనే మీ యభిప్రాయానుసారముగ రెండుమూఁడు దినములలోననే దర్శనము చేయింతుము.

వలీ—ఇప్పుడు మాకీ నిండా సంతోషం అయింది; (శిరస్తాదారుని చూచి) క్యా శిరస్తాదార్భాయ్! తెల్లపోయి చూస్తార్!—మహామంత్రి యుగంధర్లవారూ హంటే యిట్వాంటి హనుగ్రి

హం గలవారూ అని మీాకూ తల్వలేదూ- వారి దర్శనంచేసిన మనకూ యీాదినం గొప్పదినం.

జనా—(స్వగ) అన్నగా రూరలేరని యెఱింగియు నన్నే యన్నగారుగా భావించినట్లు నటింపుచున్నాఁడు. (ప్రకా) వలీఖాన్ సర్దార్ గారూ!

ఆ. కాను నేను ఘనయుగంధరమంత్రినా,
యనఘుసోదరుఁడ జనార్దనుండ
లోకదీప మైన యాకార్యసన్నిభు
ఛాయ నగుదు నేను సాయెబేంద్ర!

వలీ—సంతోషం—సంతోషం—మేము జనార్దన్మంత్రిగారి పేరు కూడా విన్నాం—యిప్డూ వార్ని స్వయం అంకీతో కన్నాం.—మీారు రాజావార్కంటే- యుగంధర్మంత్రీ వార్కంటే యెక్వా వారు కన్కు- వారు యిద్దరూ లేనిమమాయంలో మిమ్మల్ని పంచినార్—ఇది చాలా చాలా చాలా షుదినం. మాకు యిఁక శెల్వ దయచేయించవా లా.

జనా—చిత్తము.

శిర—మా నౌకర్లు దారిలో రోగాల్పడి మర్గయా అవినాక్- కొంచెం హాజామ్లూ—డోబీలూ దయచేయుంచవాలా మంత్రిగార్కీ- కోర్తాం.

జనా—వెనుకనుండి మే మేర్పాటు చేసెదము. మీా రరుగవచ్చును.

(తురకలు సలాములుచేసి నిష్క్రమించెదరు.)

జనా—(తెరవంక చూచి) ఎవరోయి జవాన్లు?

జనా—(ప్రవేశించి) అయ్యా!

జనా—శిరస్తా విశ్వాసరావును రమ్మని చెప్పు.

జవా—చిత్తము. (నిష్క్రమించును.)

జనా—(స్వగ)

గీ. పురమునం దన్నగారును భూవరుండు
లేనివేళ మహాతంత్రి మూని తురక
సేన విడిసెను పురబహిఃసీమయందు
నేయుపాయంబు వీరి నూఱింపఁ గలుగు ?

(కన్నులుమూసి ఆలోచించుచున్నాఁడు.)

[విశ్వాసరావు ప్రవేశము.]

విశ్వా—జయము జయము జనార్దనమంత్రిగారికి —

జనా—విశ్వాసరావు! కూర్చుండుము ఇప్పుడు మహామంత్రాంగమే నడుపవలసి వచ్చినది !

విశ్వా—తురకవానివిషయమునందేనా ?

జనా—ఔను.

శా. ఢిల్లీనాథుని యానచేత, మనపీటిం జొచ్చె; గుస్త్రాతుఁ డా
వల్లీఖానుఁడు; వాని వ్యూహము జగద్వంద్యంబు; సర్వంబు ను
ద్వల్లీలం గలగుండు జేసి, మనరాజ్యశ్రీలఁ గాపాడి, క
ర్త్యుల్లాసంబుల నందఁ గా వలయు; రాజోత్తంసుచే నన్నచే.

విశ్వా—తురకవాఁడు మహాకపటశీలుఁడై ప్రవర్తించుచున్నాఁడు; ఇప్పు డన్నగారుండిరేని—

జనా—అన్నగారు వచ్చులోపల ఘనపనిని మనము చేయుదము. ఈ క్షణమే నీవు నావచించిన విధంబున నొనరింపుము.

విశ్వా—చిత్తము. ఆజ్ఞకై వేచియున్నాను.

జనా—క. నాశిక మొదలుగ భద్రము
హాశైలముదాఁక నావ లన్నిరకములన్
నాశనముఁ జేయఁగావలె
నీశాసన మెల్లయెడల కిపు డంపవలెన్.

తిరిగియుత్తరవగుదాక-గోదావరి నవ్వలను దాటఁగూడదు; దాటినఁ గూడదు. అతిక్రమించినవానికి శిరచ్ఛేదము.

విశ్వా—చిత్తము.

జనా—ఇంకొకమాట—

సీ. అన్నగారెచ్చటనున్న రమ్మని చీటి
బేగిరావ్రటపాల నేగవలయు
మృగయావినోదియా నృపచంద్రునకుఁగూడ
నతిరయంబున వార్త లంపవలయు
ననుమకొండఁ జెలంగుఘనసేన లన్నియు
యుద్ధయత్నంబున నుండవలయు
వీరుఁడౌ సేనానిబేతాళరాయని
బవరంబునకు సిద్ధపఱుపవలయు
మీరు వేయికన్నులతోడ మెలఁగవలయు
తురకబంటుల శిరముల తోరణంబు,
తోరుగల్లోటకొమ్మలఁ జేరుదాక
నిలుపఁగారాదు కంటిపై నిదుర మనము.

ఇదిగాక—వల్లీఖానునకు, నెల్లు కావలయునట! ఇది వేగుకాండు పన్నిన తంత్రము—అందులకు మన వేగులవాండ్రను చాకళ్ళు మంగళ్ళుగా నటుఁ బంపుము

విశ్వా—చిత్తము. (తెర వ్రాలును)

3 వ రంగము.

జనార్దనుని ఏకాంతమందిరము.

జనా—(స్వగ) మఱచితిని—మహారాజుతోడ నభేదమగు రూపము గల చాకలిపేరిగానిని జూపి—మున్నొకమారన్నగారు—"ఒకా

నొకప్పుడు మహోపాయకరం బగు సమయమున నీపేరిగా దుపయోగించు" నని నుడివియున్నారు. వాని నీమంత్రమునం దుపయోగింపవచ్చును. (తెరవంకఁ జూచి) ఎవరోయి అక్కడ?

భటు—(ప్రవేశించి) మహాప్రభూ!

జనా—చాకలిపేరిగానినిఁగూడ తురకల గుడారములకుఁ బోయి నౌఖరీయా దంతుమనుము—వానిని భద్రముగ నిదివఱ కచ్చటి కరిగిన చాకళ్ళ కప్పగింపుమనుము.

భటు—చిత్తము. (నిష్క్రమించును.)

జనా—(స్వగ) తురకల గుడారములలోనికి భూబిలమార్గమున తుపాకిమందు దట్టించి కాల్చివేయవలయునని యానతిచ్చితిమి. అది యెంతవఱకైనదో!

భటు—(ప్రవేశించి) మహాప్రభూ! ఢిల్లీనుండి వచ్చిన యొక బ్రాహ్మణుఁడు తమదర్శన మపేక్షించుచున్నాఁడు.

జనా—రమ్మనుము.

భటు—(నిష్క్రమించును)

జనా—(స్వగ) ఢిల్లీనుండియా!—బ్రాహ్మణుఁడా!! ఏమైయుండును? ఇదియును శాత్రవప్రయుక్త మగువిద్రోహ మైయుండునా? కానీ చూతము.

[చెకుముకిశాస్త్రి ప్రవేశించును.]

చెకు—జయము జయము మహామంత్రివారికి—

జనా—కూర్చుండుఁడు.

చెకు—(కూర్చుండును.)

జనా—(స్వగ) ఏమి యీవిచిత్రవేషము? ఈతఁ డెవ్వఁడో యాగంతుకుఁడు!

క. కులమున విప్రుండఁట! వ్యా
కుల మగు వదనంబు రోషఘూర్ణిత మయ్యెఁ
గలదు కరవాలముం గర
తలమున నితఁ డెట్టివీరదర్పోద్ధతుఁడో!!

(ప్రకాశముగా) తమచరిత్రమేమి?

చెకు—మంత్రిశేఖరా! నాచరిత్రమును సావధానముగ నంగీకరింప వలయును.

జనా—వచింపుఁడు.

చెకు—నాజన్మస్థాన మాంధ్రదేశము. బుద్ధిమాంద్యమున నేమి—విధి దుర్విపాకమున నేమి— దుష్టసహచరప్రేరితుఁడ నై— బాల్యముననే గృహత్యాగముఁ జేసి వారణాశి కరిగి సమస్తభాషలను లోకతంత్రంబులను జక్కఁగా నెఱింగి—ఢిల్లీపురంబున కరిగి సుల్తానుకడ నుద్యోగి నై యుంటిని.

జనా—తరువాత—

చెకు—అప్పట నున్నకాలమున హిందూమతద్వేషు లగుతురకలు చేయు క్రూరకృత్యంబులకు నేను హృదయంబుననే వగచుచు నేమియుం జేయలేక మిన్నకుండువాఁడ నగుచుంటిని.

సీ. బ్రాహ్మణు ల్గనఁబడ్డ బలవంతముగఁ బట్టి
గోమాంసమును నోటఁ గ్రుక్కువారు
మొగమునఁ దిలకంబు పోవునంతకు వినో
దమున నుచ్ఛిష్టంబు నుమియువారు
తలనున్న పిల్లజుట్టులను పెచ్చులతోడ
దయ యింతయును లేక లెసుగువారు
సుందరు లైయున్న హైందవబాలల
బలవంతముగఁ జెఱఁబట్టువారు

దేవతాధామములందు మూత్రించువారు
మంచిశివలింగములఁ బెకలించువారు
ఖలు లయినమ్లేచ్ఛు లధికారగర్వమునను
నలుపుచున్న వా రెన్నని కలుషములను.

జనా—వినుటకు మిగుల దుర్భరముగ నున్నది. హిందూజన్మమునంది యుఁ దమ రిట్టిమతాంతరులసేవ కేల నంగీకరించితిరి?

చెరు—ప్రారబ్ధముచేత—మహాప్రభూ! ఇంతవఱకుఁ జెప్పినది యుపోద్ఘాతమే! ఇఁకముందు చెప్పఁబోవునదియే నాచరిత్రము. అనుగ్రహించి యాలకింపవలయును.

జనా—కానిమ్ము తరువాత?

చెరు—ఒకనాఁడు తురకలవిందు జరుగుచుండెను. కార్యాంతరమున నెటయేనింబోవు నేనందు నిలువఁబడ మధుపానమత్తుఁడగునొక తురక గోమాంసమును నానోట నిడఁబోయె. నే నందులకియ్యకొనక నిరాకరింప నలువురు నాపైఁబడి పరిభవింపఁబోయినంత వారినందఱను నాకరవాలమున కెర గావించి యీతురకల రాజ్య మంతరించునుపాయం బెయ్యది యని చింతించుచు ఢిల్లీపురంబును వదలి ధర్మపరిపాలనము సేయు శ్రీకాకతీయ ప్రతాపరుద్రమహారాజందులకు సమర్థుం డని మీసహాయం బపేక్షించి వచ్చితిని.

ఉ. భారతరాజ్యరక్షణము; బ్రాహ్మణధర్మసురక్షణంబు; గో
మారక, ఘోరపాపరత కిల్మిషకర్ముల మ్లేచ్ఛులన్నిరా
ధారులఁగా జయించెడువిధం బిఁకఁ గాకతివంశవర్ధనుం
డారసి చేయ గావలయు నంతకుఁ గన్పడ వన్యమార్గముల్.

జనా—(స్వగ) దేశదుర్దశం దలంచుకొని యీతం డందుపరితాపము, యథార్థరూపమైనదిగనే-తోఁచుచున్నది గాని-నటనమునయిత

మిటులే యుండును గదా! వచ్చినవాఁడు, ఢిల్లీసుల్తానుదగ్గఱ నుండినవాఁడు. జరుగుచున్న దాడియు ఢిల్లీకి సంబంధించినదే! ఢిల్లీఖానుని యొత్తుగడయీ యసామాన్యముగ నున్నది. ఈతని నెట్లు నమ్మవచ్చును?

ఆ. వేషభాషలందు విశ్వాస ముంచి యి
ల్లిల్లవారిఁ జేరనిత్తుమేని—
కీలెఱంగి మోసగింతురు పగవార
లింతిదొంగ లగుచు, నెఱుఁగనట్లు

చెకు—(స్వగ) ఈమహాత్ముఁడు యథార్థవాదినైనఁ నన్ను విశ్వసించుట లేదు. ప్రపంచధర్మ మిట్లేకదా నడచుచున్నది. అనృత ముందున్న రుచి సూనృతమందు లేదు. (ప్రకా) మహామంత్రిశేఖరా!

చ. పగతునియింటనుండి యిటువచ్చినవాఁడని సంశయించి, వే
ఱుగ నను నెంచఁగావలదు, రూఢిగఁ దెల్పితి నయ్య సర్వముఁ
మగటిమి వైరిసేనలను మార్కొనఁగల్గుదు; చాలుబూని నే
నగణితకార్యదీక్ష నిపు డాదలఁ బూనితి విశ్వసింపుఁడీ

జనా—నీవు మాకు విశ్వాసపాత్రుండ వనునిదర్శన మేమైనఁ జూపఁ గలవా?

చెకు—మంత్రిసత్తమా! జరిగిన వృత్తాంతమును పూనినకార్యదీక్షయు నెఱిఁగించితిని. ఇంతకన్న నిదర్శన మేమి చూపఁగలను?

జనా—అట్లయిన నొకటిరెండు దినములలోన మాయన్నగారును, ప్రభువువారును రానైయున్నవారు. వారు రా వేగమే దర్శనము చేయించెదను. అప్పుడు నిర్ణయింపఁబడును. ఇందేది వచించుట కును నేనసమర్థుఁడను. ఇప్పుడు కార్యాంతరములు గలవు. ప్రస్తుతము దయచేసెదరా? (ఇద్దఱును లేతురు.)

చెకు—చిత్తము. తెర వ్రాలును.

## 4 వ రంగము.

### ఓరుగంటిపురవీధి.

[విచారముతో సాలోచనముగ చెకుముకిశాస్త్రి ప్రవేశించును.]

చెకు.—కటకటా! అక్కడ తురకలకును—ఇక్కడ హిందువులకుఁ బనికిరాక—నే నిప్పుడు గబ్బిలంబువలె నల్లాడ వలసినవాఁడనైతిని ఇది మ్లేచ్ఛసేవామహాపాతకమునకు ఫలము! నాగతి యిట్లు కావలసినదే!—

ఉ. ఆర్యపథానువర్తు లగుహైందవభూపతు లుండ నెదఁదో
దుర్యశభిక్షు కొగ్గితిని దోసిలి జానెడుపొట్టకోస మై-
కార్యము నెంచు సింహుఁ బొడఁగానక వెంగలి నైతి నిట్టిదు
ష్కార్యము సల్పినందులకుఁ గావలె నాకుఁ బరాభవం బిటుల్.

సీ. మాతృదేశాభిమానంబు మంటఁగలిపి-
మాతృదేశధర్మంబులు మఱచిపోయి-
యన్య దేశీయులకుదాసు లయినపంద
లందఱును దుఃఖములమొకల్గు నంతమందు.

ఈవిచారముతోడ నిప్పు డేమి?—పుట్టెడాసతో వచ్చి యిటు లైతిని గదా! ముందుగతి యేమి?—నాపరాభవదుఃఖం బెట్లుతీరును? ఏమిచేయుదును? బంగారుపళ్ళెరమునకైన గోడచేర్పుండవల యునన ట్లు నా కెంత పరాక్రమ మున్నను—సేనాసహాయము లేక వారి నెట్లు నిర్జించుట—కటకటా! పేరు గాంచియున్న యోరుగంటిసామ్రాజ్యమే హిందూధర్మనాశకు లగుమ్లేచ్ఛుల పాలఁ బడకున్న నింకెవ్వఱింకులకు సమర్థతగలవారు—నిజా నిజంబు లారయలేని యీమంత్రులు మేధానిధులఁట! ఎంత యవివేకము!—

ఆ. పాపనాశయమున సేవింప వచ్చిన
సమ్మోదమయ్యె నను జనార్దనుండు—
సూనృతంబు మాని యనృతంబు లాడిన
యొకల విశ్వసించునే నెమి కొంత.

[విద్యానాథుఁడు ప్రవేశించును.]

విద్యా—ఓహో! చెకుముకి శాస్త్రి గారూ యేమి? ఇదియేమి యిటులు
న్నారు! కార్యము సఫలము కాలేదా?

చెకు—అనిన మాటయే—జనార్దనమంత్రి నన్ను విశ్వసింపక—
రాజు వచ్చునంతదనుక వేచియుండుమనియె—అప్పుడైన నన్ను
విశ్వసించునట్లు సూచింపలేదు.

విద్యా—(ఆలోచించి) అయ్యా! ఈదోషము కాలమునందున్నది
మీరు మంత్రిగారిని దర్శించినసమయ మట్టిది. ఏమనిన—

చ. పురమును మ్లేచ్ఛపుంగవుఁడు ముట్టడిపై చెయ దాడికీతిగా
తిరముగ నాత్మభావమును దెల్పక మైత్రి జరించుచుండె నా
పరమకిమస్వభావుఁడు—భవచ్చరితంబుకు ఫిల్లి నాట నే
యిగవున విశ్వసించు మిము నిట్టిపరిస్థితులందు మిత్రమా!

కా. స్వభావంబు నెఱిఁగి యిప్పు డచ్చటికరుగుటయే యనాలోచితము.
కావ్యకన్యకను సమర్పింపఁదలంచి రాజదర్శనమునకై వచ్చిన
నాకు సయితము మీకాలదౌష్ట్యమే యాటంక మయ్యెను.

చెకు—అట్లయిన మన కిపు డేది కర్తవ్యము?

విద్యా—నా కొక్కయుపాయంబు తోఁచుచున్నది—అందువలన
నాకోరిక యెటులున్నను మీపరాభవము చల్లారునట్లు మ్లేచ్ఛ
రక్తవాహినులు ప్రవహింపఁగలవు!

చెకు—ఆహా! నాకన్నుల కంతటి శుభకాలమా?

విద్యా—అవశ్యము గల్గును. మీకాయుపాయము నెఱిఁగింతును రండు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

5. వ రంగము :— వల్లీఖానుని డేరా.

[ఆసనములయందు వల్లీఖాన్, ఖుస్రూఖాన్, ముస్తఫాఖాన్, ఫిరోజ్ ఖాన్, ప్రవేశము.]

వలీ— ఖుస్రూ ముస్తఫాఫిరోజ్ ఖాన్ యోం! ఢిల్లీసుల్తాన్ హుకుంసే-హాం యిధర్ ఆకర్— అబ్ తక్ కియా సో కాంతమాం బరాబర్ చలాహై— అభీకర్నే కాకాంబహుతుంముష్కిల్ మాలుంహోతా-ఏయ్— ములుక్ పకడ్నేకూ క్యాక్యారస్తా ఆప్కా దిల్ మేతూ లుంహూవాతా జరూర్ బోల్నాచాహియే—

ముస్తఫా— వలీఖాన్ బహదూర్ సాహేబ్- ఇస్మేముశ్కిల్ హై- కీ-అభీ వరంగల్ మహారాజా జంగల్ మేపికార్ కర్తేహై— ఏయీవక్తుమే-హాం-ఖిల్లాకూ పకడ్నేసే- రాజా వో బాత్ సున్కర్ జంగిల్సే-జాగిల్సే ఫరారికర్నేవాలా హూవా జాయెగా.

ఫిరోజ్— ముస్తఫాఖాన్‌కా సబబ్ ముఝ్కూ పసంద్ హై.

ఖుస్రూ— సర్దార్ సాహేబ్-మేరీ ఛోటీ అక్కల్మే మాలుం హోతా హై-కీ-ఏరస్తా బిల్కుల్ పసంద్ నహీహై— హాం ఇధర్ కిత్నా ఖరస్ లడాయీకర్నేసేభీ— ఖిల్లాకాఅందర్ ఖానే కూడస్ ఖరస్కామాల్ భరాహై— ఓబాత్ జంగల్ మేరాజా సున్కర్ భాగ్నేవాలే నహీహై-మగర్-హమ్నకొండలష్కర్ లాకర్ - బహూత్ లడాయీకర్నే వాలాహై - దోతరఫ్ రాజాకాలష్కర్ హాంసేలడాయీ కర్నేసే-హంతమామ్ మర్జానేకా బాత్ హై - ఇస్లియే - మై సంస్తాహుం - కీ-జంగల్ మేరాజాకాసాత్ హాల్కాలష్కర్ హోతా-అభీ హం రాజాకూ పకడ్ లేనేసే-ఖిల్లాకు పకడ్నేకూ ముష్కిల్ కుచ్భీనహీహై తబ్-ఆప్నబాబ్-హాంగులాం.

వలీ—భాయీలోగ్!—ఆప్ కహాఁసోరహా ఏక్ సేఠక్ జాగ్ అచ్ఛాహై-
మగర్—ముఝేబి శక్......

[భటుఁడు ప్రవేశము.]

భటు—సలాం సర్దార్ సాహెబ్! దర్వాజామే యేక్ బొమ్మన్ ఆకే-
బహూత్ గడ్బడ్ కియా-జోర్ హాంకర్ బహూత్ జులుం బీకి
యా-అందర్ జానేకా హుకుం 'నహీఁహై మతుజావ్' బోల్నేసే
బీ సునానై-మేరేకు గోలీ కామాఫిక్—దర్వాజాసే ఫేక్ది
యా- జాతె దేఖ్నేసే బొమ్మన్- హాత్ దేఖ్నేసే షైత్- హుకుంహైతో ఉస్కా జాన్ నికాలుంగా సర్కార్—

[చెకుముకిశాస్త్రి ప్రవేశము.]

చెకు—నోరుమూయరా! అభాజనుఁడా! నా 'జాన్' 'నికాల్' చేయువాఁడవు నీవా? చచ్చిన నీయబ్బ—నీతాత—దిగివచ్చినను సాధ్యమగునా? (స్వగ) వేషభాషలు పూర్ణముగ మార్చుటచేతను ఢిల్లీలోనసయితము నాతో విషయసంబాధము లేకపోవుట చేతను ఈపందలు నన్ను గుర్తింపలేదు. శ్రీవిద్యాసాధకవి మహామంత్రము నిచ్చుట ప్రయోగించెదఁగాక!-(ప్రకా) సలాం వల్లీఖానే సాహెబ్! నీకు మహావిజయకాలము సంప్రాప్తమై యున్నది.

* ఉ. ఖానకులావతంస! గరకంఠుఁడు నీకనిశంబుఁదోడు ; నీ
ప్రాణము నర్కజుండు తనపై నిడి భద్రముచేయుఁ జేతు ; ది

---

*శ్మశానములందుండు శంకరుఁడు నీకుతోడగుటచేత నీవు శ్మశానమునఁ బెట్టఁబడుదువనియు, యముఁడు నీప్రాణము మోయునటచేత మృతినందుదువనియు (అర్కజుఁడనఁగా శని—అతఁడు 11 వ స్థానమందున్నచో మహాదశయని మొదటి యర్థము) స్వర్గము నీకు లభించుననుటచేత సయితము మరణింతువనియు—చచ్చినవారు సూర్యమండలమార్గమునఁ బోవుదురు కావున సూర్యుఁడు దారిచూపుననుటయు—ఇదిగాక సూర్యుఁడుదప్ప నీకు దారిచూపు పరివారము లేకుండుగాకయనియు—వల్లీఖానుని నాశనమును సూచించుచున్నాఁడు.

వ్యాసన లైనసుందరులు వాసముఁజేసెడువీడు వీడు; నా
భానుఁడు దాఁచూపుపనివాఁడు; సుగా యిఁక నీకుసాహెబా.

వలీ—(స్వగ) ఈబ్రాహ్మన్ బలేహుషార్వ్యాఁతూ తోస్తుంది. నాకీ గుర్తు యెలాగపట్టినాఁడు? మాకీ వేగు తీయడానికి—జనార్దన్మంత్రి యేమైనపంపినాఁడో యేమో—(ప్ర) పంతులూ-ఎవరు మీరు?

చెరు—మేము పంతుళ్ళముగాము; మొంతుళ్ళముగాము—సూ కాత్రి ళ్ళమయినను లేము. మేముచ్చమైన శాస్త్రుల్లవారము!—నాపేరు భేతాళశాస్త్రులు.

క. భేతాళునకుల నాకర
ఘాతంబున సఖులు చావగా మోఁకట, వి
ఖ్యాతిగ శాల్యమునుండియు
భేతాళుఁ డనెడుపేరు విశ్రుత మయ్యెన్.

వలీ—జనార్దన్మంత్రివారి తరఫున వచ్చినారా మీరు?

చెరు—ఒకఁడు పంపుట-నేను వచ్చుటా! నేనేమి వానిగులామునా?- వాఁడెవఁడు నన్ను పంపుటకు?

వలీ—(స్వగ) అరే! జనార్దనమంత్రి)—అంతవాడికి 'వాఁడు వాఁడు' చెపుతాడు—గారు చెప్పంలేదు. రాజాకీపిడుదుమ్మన్ కావాలా- కాకపోతే దొంగయేసుయేసిమాకీమోసంతల్సి వుంచవాలా. ఫర్వాలేదూ—చూతాం— (ప్రకా) నూకోండిశాస్త్రుల్గా— మాకీ యోలాగా పోల్చుకున్నార్?

చెరు—తెలియదా? జోస్యపుదెబ్బ!—ఆజోస్యము మిడతంభొట్లు జోస్యమనుకున్నావా? పూర్వము కటకపురాజు నాజోస్యము పరీక్ష చేయఁగోరి, "యిప్పుడు దేవలోకమున నేమిజరుగుచున్నదో చెప్పు" మనెను. "దేవేంద్రునిసభలో నిప్పుడు రంభానృత్యము జరుగుచున్నది. ఇప్పు డారంభ చేతికంకణము జారిపడినది.

అని యిక్కడనో యిక్కడనో తప్పక పడు నని రెండువిరలు" గీసి తిని. తప్పక చూచుచుండగా- నాకంకణ మూరెండువిరలయం దొకదానిలో పడిపోయినది.

అందఱు—(ఆశ్చర్యముతో) బలే- బలే- ఎంతగొప్ప జోస్యం- ఎంత గొప్పజోస్యం—

వలీ—రెండు విరలుగీసినారేమి? సరిగా యొకటి చెప్పలేక పోయినార్ శాస్త్రుర్లూ—

చెరు—అబ్బో! అసాధ్య మయినమేధ! సామాన్యుఁడా వలీఖాను? ప్రశ్న వేయనే వేసినాఁడు. సాహెబుగారూ! ఎంతగొప్ప జోస్యుఁడు చెప్పినను ఫలిత మాపాటిభేదముగ నప్పుడప్పుడు వచ్చుచుండును ఇది పార్వతి జోస్యమునకుఁబెట్టిన శాపము!

వలీ—మంచిది. మీరు మాహుకుం లేకుండా లోపల్కి యెందుకు వచ్చినార్—

చెరు—ఆప్రశ్న మిప్పుడడిగిన మీరేమి చెప్పఁగలరు? స్వాచరణమునకుఁ బనికిరాని పరోపదేశ మెంతయైనఁ జేయవచ్చును ?—

చ. అడవులుచుట్టి రాజ్యముల నన్నిటి మెట్టి-ప్రియాసదొట్టి, యీ
పుడమి సమస్తముం గొనెదుపోలిక సేనల చేతఁబట్టి, సం
దడి యొనరింప కీవిధిఁ బ్రతాపుని దీపితరాజ్యమందు మీ
రడుగిడ నేమిహేతు వెవరాజ్ఞ యొసంగిరి మీకు సాహెబా?

వలీ—(స్వగ) మల్లీ "ప్రతాపుడు" అని హాగార్వం మాట సెప్తాడు. ఇతనిమంగతి కొంచెం తెల్సుకోవలా- (ప్రకా) శాస్త్రుర్లూ! నీకు యింతసాహసం మంచిది కాదు- మాజవాన్ పొడిచేస్తే మీకని యేమైవుండును ?

చెరు—పొడి చేస్తేనా?—కారప్పొడి—కందిపొడి—కమ్మసిపొడి—ముక్కు పొడి—యిప్పుడిప్పుడు కాఫీపొడి కూడా వచ్చుచున్నది.

ఇం దేపొడిచేసినను, సాహెబులుచేసిన పొడి మేము తాకము.
ఈయ భాగ్యుఁడే నా నన్ను పొడుచువాఁడు. భేతాళశాస్త్రుల్ల
నని ముందే చెప్పితిని తెలియలేదా ?

క. మాపయినఁ గత్తి నత్తిన
పాపులు మాచే నశింతుర పదుగురు; మేమీా
వ్యాపారము న నశింపము
కాపుగ జాతకము మాకుఁ గల దిటు వినుఁడీ.

వలీ—(స్వగ) ఈ శాస్త్రుల్లూ కటకం రాజామహాచారంకూడా చెప్తాడు. ఇతన్ని వదలకూడదు. కాని జనార్దన్మంత్రి చేసి పంపిన దొంగశాస్త్రుల్లేమో అని భయంక ద్దాను- (ప్రకా) శాస్త్రుల్లూ ! ఐతే మీపని మూడునిముసాల్లో సీదాగా చెప్పి యెల్లండి. మేం బహూత్ జరూరైన పనిమీద వుంటాం.

చెరు—అబ్బో ! మీా జరూరైనపని యిదే కదా ?

క. రాజును బట్టుదుమా ? పుర
రాజముఁ బట్టుదమ ? మనము ప్రారంభమునం
దాజి నలుపుపూర్వం బని
యోజన జేసెదరు; నలువు రూహాలుమీాఱ్.

నా జోస్యము నిజమేనా ?

ఖానులు—(మొగములు చూచుకొందురు.)

వలీ—సరే ! మీాపని చెప్పి యెల్లండి.

చెరు—చెప్పెదను- వీని (జవానుఁజూచి) నావలకు మీారు పంపుదురా ? నేను పంపనా ?

వలీ—జాకే- జా-

జవా—(నిష్క్రమించును.)

చెకు——ఈప్రతాపుని యాస్థానమందలి జోస్యుఁడు "యాచకో యాచక శత్రూ" అను సామ్యముగ నాపై నీర్ష్యచే నాకు ప్రతాపుని దర్శనము కాకుండఁ జేసినాఁడు. ఒకనాఁడు నేనే సాహసించి రాజదర్శనమునకు వెళ్ళగా రాజు నన్ను పరిహసించి——"బోడిబాపడి కెంతసాహస" మని పలికెను. నా కాగ్రహము గల్గి, "బోడియే నీపని పట్టు" నని పలికి వచ్చితిని.

వలీ——బోడి అంటే యెవరు ?

చెకు——ఎవరో మీరు చెప్పుకొనవలెను.

గీ. బోడిబాపడ నేనొక్క బోడి నాదు-
శిరము గొఱిగించుకొనియెడు తురక బోడి
యదియు గడ్డము లేనిసన్యాసి బోడి
మెండ్రికయు లేని శాపనివిధవ బోడి.

ఈనాల్గుబోడులలో నేఁజెప్పినబోడి యేబోడియో?

వలీ——అదీకూడా మీరే చెప్పవలా- కదా-

చెకు——చెప్పెదను. ప్రతాపునిరాజ్యము గెల్చు సంధిబంధనములన్నియు నాచేతనున్నవి. మీకు నేను జోస్యము చెప్పెదను. నాకు మీరు సుల్తాను దర్శనము చేయించితిరేని, ప్రతాపుని గల్చి-వానిని వానిజోస్యుని పరాభవింపవలెనని నాప్రతిజ్ఞ.

వలీ——(స్వగ) అరే- అరే- ఎంతమాట విన్నాం- వీనిమాటలు నిజం ఐతే చాలా వుపకారం- కానీ చూతాం- (ప్రగా) పండత్ జీ ! మీజోస్యం నిజం అనీ మాకు దాఖలా యెలాగ ?——

చెకు——ఇదివఱకు చెప్పినది చాలలేదా ? సరే ! నీమనోగతమును చెప్పుదునా ?

వలీ——చెప్పండీ పండత్ జీ——

చెకు——ఇతరులు విననేల? (జనాంతికముగ) ఓరుగల్లు కొట్టి ముస్తఫా

ఫిరోజులను ఖుస్రూను నామావశేషులను జేసి నీ వోరుగంటి సుల్తానువై తుదకు ఢిల్లీసుల్తానునుగూడా కొట్టి ఢిల్లీ నేలఁ దలంచి యున్నావు.

వలీ—(ఆశ్చర్యముతో) పండిత్ జీ! మీరు బ్రహ్మజ్ఞులువున్నారుగాని, సామాన్యమనిసి కాదు.

చెరు—(ముస్తఫాను చూచి) మరి నీకు చెప్పుదునా?

ముస్త—చెప్పండి.

చెరు—(జనాంతికము) ఓరుగలును పట్టుకొనఁదలచినవాఁడ వలీఖానుని మోసగించి, చంపి- నీవే సుల్తానువై- తుదకు ఢిల్లీసుల్తానును గూడ జయింపవలెనని నీయుద్దేశము కాదా?

ముస్త—(భయాశ్చర్యములతో సలాముచేసి) జోస్యులూ- శాస్త్రుల్లా- నాప్రాణం నీచేతులో వుంది

చెరు—భయము లేదు.—ఇఁక చాలునా?

అందఱు—చాలును.

చెరు—నే నిక్కడికివచ్చినట్లు హిందూదేశమునకైన తెలియనీయఁగూడదు. అట్లు తెలియవచ్చినను మీరు నన్ను మోసగించి సుల్తాను దర్శనము చేయింపకున్నను ఖరా బేమి ?

వలీ—మీరే చెప్పండి.

చెరు—మీరందఱు తేఁకువగాని ఒంటరిగగాని నాతో కత్తియుద్ధము ఖరారు అట్లు బాసచేయుఁడు.

అంద—ఆలాగే- ఆలాగే- (వాగ్దానములు చేతురు.)

వలీ—మరి మీరు యిక్కడ మాకీ యేమిసహాయం చేస్తారు?

చెరు—ఎప్పటికప్పుడు జ్యోస్యము చెప్పెదను. ఓరుగంటి రాజ్యపురహస్యముల నెఱిఁగించెదను దాని కిదియే మొదలు. మీ రెఱుఁగని వార్త యొకటి చెప్పెదను.

ఆ వ్రతము లాచరింప రామేశ్వరపు యాత్రఁ
గాంచ నరిగి మాయాయుగంధరుండు
వ్యాధి నంది యిపుడు ప్రాణసమానమ్ముఁ
డయ్యె ననెను వార్త యయ్యె నిపుడు.

రామేశ్వరస్వామి యనుగ్రహమున వాఁడే చచ్చెనా మనపీడ వదలినది.
చచ్చునని కూడ జోస్యము పలుకుచునే యున్నది.

అందం — (ఆశ్చర్యపడుచున్నారు)

వలీ — ఇంకను నాకీ వాఖలా యేమిటీ శాస్త్రుర్లూ —

చెకు — నన్ను నమ్మినవారు చెడిపోలేదు. నమ్మనివారు బాగుపడలేదు.
నన్నే మిశ్రోద్ధింపవెదవు నాయకకోసిన నబద్ధమాడువాఁడనుగాను.
యుగంధరునిదగ్గఱనుండి యుత్తరము తెచ్చిన మనుష్యునితో
నేనే జనార్దనుఁడనని వానికి యుత్తరము లాగుకొని త్రిప్పిపంపి
వేసితిని. ఇదిగో యుత్తరము; మీ కెవ్వరికైనఁ దెలుఁగు
వచ్చునా?

వలీ — (తీసికొని) కొంచెము నాకే తెలుసును.

చెకు — అందులకేనా యింత వాక్శుద్ధి? చదివిపెట్టుకునా?

వలీ — అక్కఱలేదు చదువుకున్నాను

చెకు — ఇది మన చేత చిక్కుటచేత, యుగంధరుఁడు నచ్చి యన్నికా
ర్యములును సర్దుకొనుమని కోటలోనివారు నిశ్చింతతో నుండు
గారు. ఇది మనకెంతో యుపయోగము.

వలీ — ఔను. ఔను.

చెకు — నేనిప్పటికి వెళ్ళుచున్నాను. తిరిగి దర్శనము చేసెదను. నేను తెలుఁగు
వేషముతో మీకడకు వచ్చుచుండెదన్న సమాచారము. నా
కొక తురకదుస్తు నిండు.

వలీ — (తెచ్చి యిచ్చును.)

చెకు—ఒకయశ్వముకూడ కావలెను.

వలీ—దర్వాజాలో జవాన్‌తో చెప్పి యిప్పవచ్చిందితీస్కో-సి యెల్లండి

చెకు—సలాం-సలాం-సలాం-సలాం.

అంద—సలాం-సలాం-సలాం-సలాం.

చెకు—(నిష్క్రమించును.)

వలీ—(స్వగ) ఈజోస్యుడు తెచ్చినవృత్తాంతం అబద్ధం అయివుంటుందా-కాని- ఏదీ ఐతే మనకేమి?—ఇతన్నివదలి యేస్తే- మాదీవృద్దే మం చెప్పి రాజాకీ మామీద తెస్తాడు. ఉంచితే అపాయంలేదూ తోస్తుంది (ప్రకాశముగ) ఏబొమ్మకా పక్కడబడా ఆద్మీహై భాయిదోూ !

అందఱు—సచ్ బాత్ హై.

వలీ—ఇస్వఖత్ మే- హాం ఖిల్లాస పకడ్నేసే అచ్ఛానహీహై- మై జంగల్ మే జాకే-రాజాకూ పహిలే పకడ్నేకూ దిల్ హై.

అందఱు—అచ్ఛా-అచ్ఛా.

వలీ—మై రాజాకూ పకడ్కర్- సీదాఢిల్లీ జావుంగా- ఏకాద్మీకూ భేజ్ దేవుంగా- ఆప్‌లోక్-లడాయీకర్కే వరంగల్ ఖిల్లా పకడ్ లేనా చాహియే

అందఱు—అచ్ఛా- అచ్ఛా- అచ్ఛా.

(తెర వ్రాలును)



5 వ రంగము.

[అరణ్యమున వేటవేషముతో ప్రతాపరుద్ర సామ్రాట్ ప్రవేశించును]

ప్రతా—ఏమి యీవనరామణీయకము !

సీ. మొకములు కాంతి నబ్బురముగాఁ దోఁపించు
పచ్చకరత్నకంబళముఁ బఱచి
విరియఁబూచిన మేలివిరులతావుల నించు
కేళికాంచితలతాగృహము లల్లి
మెల్లమెల్లన వీచు పిల్లగాలుల చేత
పింఛామరంబుల విసరఁజేసి
లలితశీర్షంబున లాజాక్షతలు గాఁగ
జలజంపు రాలుపుష్పచయంబు జల్లి
వనమయూరనాట్యంబు లవ్వారి గాఁగ
ద్విజకలారావములు దశదిశల మ్రోఁగ
పల్లవపుంబళ్ళెరంబు నివాళి గాఁగ
రాజవిభవంబు లొసఁగు నారామలక్ష్మి.

వలరాజాప్తసమయనవోదిరా సముద్భిత నీరాజనప్రదీపాంకుర సదృశ కోమల కోరకాన్విత చంపకప్రసూనంబులును, కరకంఠతపోభంగసముదయ సంపాదిత శరీరభస్మాంగరాగంబును, పరాగమిషంబున విసర్జించు మదనచాపవినిర్ముక్తంబు లగు సురపొన్నలును, పవమానకుమార పరిసార ప్రకంపమాన కిసలయ కంటకక్షతంబులై- స్మరసిద్ధాభిముద్రిత సుచిరకారాంగనానికర కుచభాగ బాంధవంబు లగు నాగిరత్తోరంపు మారేకుబాడ్లును, శుకరాజ నికర నాశికాపుట ప్రహతంబులై- మాధురమకరందరసప్రసారంబునం గ్రిందఁ జెందియున్న పాంథులకు విందులు సేయు మధురసవిబంధురంబు లగు మాకందంబులును, భావజప్రమోదవిహారసాధకంబు పరిమళిత ప్రసవశయ్యాబంధురనిగూఢ విశ్రాంతలతామందిరంబులును గలిగి యీయుపవనంబు, మృగక్రీడావశంబున నలసటనందిన నాయంగంబులకు శ్రమహర

హాఠిరైయె యొప్పుచున్నయది. (ఆవులించి) ఏమిది? నేఁడు నాకు కట్టుపవలు నిద్దుర వచ్చుచున్నది పగటినిద్దురను పెద్దలు దురాచారంబుగఁ బరిగణించిరి; నా కిది యుక్తమా? (ఆలోచించి) ఆ! ఇప్పట్టున నిది నావిషయంబున నయుక్తము కాకపోదు; ఏమనిన,

గీ. వ్యసనముల నొక్కటగు మృగయావినోద
పరతఁ గనునాకు దూష్యమే పగటినిద్ర?
క్షితి దురాచారమధుపానరతుఁడు ధూను
పాన మొనరింపఁ గొంకునే భావమందు.

ఈసమీపమునందుఁ గల నిర్మలకాసారతీరమున నున్న యీవిశ్రాంత శిలాతలంబు శయనయోగ్యంబుగా నున్నది. ఆహాహా! మంద వాతమార్గంబునఁ బరతెంచు నీనరోవరజంతుపారప్రాతం బెంతయానందకరముగా నున్నది. మఱియును,

ఉ. * రాజవిరోధబుద్ధి బహిరంగము సేయక నప్పుడున్న దీ
రాజితపంకజంబు విమరక్తిసు నాంటటినో ప్రహబుద్ధి యో-
వ్యాజముగా స్వకీయకరబ ధవళ్ళ ఖండము ల్దగిల్చి, తా
నోజ సరస్సు డాయఁగొనుచుండెను మందసమీరవీచుఁడున్.

శ్రాంతతడ విందు విశ్రమించెదఁగాక! (నిద్రించును)

[ఇరువురు తురకభటులు ప్రవేశింతురు.]

1 భటు—క్యారే! జమాల్- జంగల్ మే బహూత్ ఘుంకే ఘుంకే హైరాన్ హోగయా- రాజాకీపత్తా బిల్కూల్ దిసానై- అభీ క్యాకర్నా- బోలో.

2 భటు—అరే భాయ్! హల్లా కామెహర్బాన్ సే- మే రేకూ రాజాకూ పకల్నే నా కాసనీబ్ హైతో-వలీఖాన్ బహదూర్ సే మై-హజార్ రుపియా భక్షీస్ లేవుంగా.

* ఈవర్ణనమునలన ప్రతాపరుద్రుని భావిస్థితి సూచింపఁబడుచున్న ది.

1 భటు—తూ ఏక్ హజార్ లేనేసే మై దో హజార్ లేవుంగా—

2 భటు—తూ దో హజార్ లేనేసే మైజరూర్ పాంచ్ హజార్ లేనే వాలా.

1 భటు—తేరేకు పాంచ్ హజార్ దేనేవాలా దున్యాపర్ కోహీ దివానా హైతో—మేరేకు దస్ హజార్ దేనేవాలా దస్ దివానా జరూర్ రహేగా—

2 భటు—(పీఠముపై గొట్టి) అరే యారే—దున్యాపర్ దివానాకో హీ నహీ హై—తూ పహిలే దివానో, హం దుసరే దివానా—రాజాకూ నై దేఖా—వాజాకూ నై దేఖా—అభీ కైకూ లడాయ్ రే—జావ్—జంగల్ మే దేఖుంగా—పీఛే హల్లాకా మెహర్బాక్ హై హమారా నసీబ్ హై.

(పరిక్రమింతురు)

1 భటు—(రాజును చూచి) అరే యార్—దేఖో దేఖో.

2 భటు—క్యారే?

1 భటు—అరే! ఓపత్తర్ కర్ దేఖో—ధగ్ ధగ్ ధగ్ ధగ్—కోయి చమక్తా.

2 భటు—అరే భాయ్ మై సమ్‌ఝా—ఆస్మాన్ సే సూరజ్ నిఛే ఆకర్—ఇదర్ సోగయా.

1 భటు—సూరజ్ నైరే—చందర్—హోతా.

2 భటు—చందర్ భీ నై—ఇందర్ హోతా.

1 భటు—అరే దివానా సూరజ్ నై—చందర్ నై—ఇందర్ నై—ఏ ఆద్మీ వరంగోల్ మహారాజా ప్రతాపరుద్దర్ హోతా.

2 భటు—అరే పకడ్లేవ్—పకడ్లేవ్—జల్దీ.

1 భటు—అరే! ఉన్కా సాత్ మే జానేకూ హంకూ డర్ హోతా.

2 భటు—హంకూభీ డర్ హోతా క్యాకర్నా—

[గొలుసులతో వల్లీఖానుఁడు ప్రవేశము.]

వలీ—క్యారే గడ్‌బిడ్?

1 భటు—సలాం సర్దార్ సాహేబ్! ప్రతాపరుద్దర్ మహారాజ్ ఉధర్ సోగయా! (చూపును)

వలీ—(స్వగ) హల్లాకా మెహర్బాన్ హై- హల్లాకా మెహర్బాన్ హై- వా! వా! కైసా సూరత్ హై—భేషక్—(శిరఃకంపనము చేయుచు)

క. ఇందర్ సే చందర్ సే
సాందర్ సే మదన్ దేవ్ సె జాదా సూరత్
బందూక్సే తర్వార్సే
ఘుంద్గోల్ నహీంహో నెకాయిన్న జాత్.

(ప్రకా) రే! జమాల్! రే! మూసా! రాజా బరాబర్ నీంద్ కర్తాహై- పకిడ్నేకూ ఇస్‌సే అచ్ఛావఖత్ నహీంమిలేగా—ఏశుంఖల్ లేజాకర్ బంద్ కర్దేవ్! పహిలేతర్ వాక్ నికాల్ దేవ్! ఇన్కా సో తేసే మత్ జగావో—జల్దీజల్దీ —మైజంగల్ కా అందర్సే సబ్ దేఖుంగా.

(నిష్క్రమించును)

(భటులు, యథాప్రకారము చేయుచున్నారు)

ప్రతా—(నిద్రమేల్కొని) ఏమిది? నా కరచరణంబులను క్రూరసర్పములు చుట్టుకొనినట్లు స్వప్నము వచ్చినది. (పరికించి) ఓహో! క్రూరసర్పములు కావు. ఎవ్వరో శాత్రవులిందు శృంఖలానిబద్ధునిఁగాఁ గావించినారు— ఏమీ యీయుపద్రవము! కట్టపగలు నద్దురవచ్చుట దీనికి సూచనయే కాఁబోలును. మహాత్ముఁడగు యుగంధరుఁడు తీర్థయాత్రకరుగుచు, "నేను వచ్చునం

దాక మృగయావినోదమును మాను"మని యానతిచ్చెను. ఆహా తోఁపదేశమును నిరాకరించినందుల కిది ఫలమని తోఁచుచున్నది.

గీ. ఆర్యగురువారి నీతివాక్యములు మదినిఁ
  బాటిసేయక, చరియించుపాపఫలము
  ననుభవింపక తప్పునే? యజునకైన
  నెఱిఁగి సర్పంబు బట్టినఁ గఱువకున్నె?

ఇంతకు నిది యొనరమోసమో—తెలియదయ్యో—తురకదండు జేమైన దేశమునం బ్రవేశించెనా! ఇంచుకైన వార్త తెలియదయ్యో నే? (తురకల భటులను జూచి) సందేహమేమి? ఇది మ్లేచ్ఛుల దుష్కర్మమే—ఈతురకభటులు నిది యెవ్వరిపనియో ప్రశ్నింతును. (ప్రకాశముగా) ఓరీ! ఇదయేమిరా నీచమైన పనిచేసిరి? మీ రెవ్వరి భటులు?

భటు—(పలుకకుందురు)

ప్రతా—(స్వగ) వీ రుత్తర మిచ్చుట లేదు. నాకిదికాలము సయితము వీరిచేతులకుఁ జిక్కినది. కానిమ్ము; నన్నీ శృంఖలము లేమిచేయును? ఓ పరమేశ్వరా!

చ. మలకలదండు వచ్చి. వనమధ్యమునం దిటు నన్ను శృంఖలా
  కలితునిఁ జేసి బంధితునిఁగాఁ గొనిపోవగనుండె; మద్భుజా
  బలమున, బంధముల్ సడలఁబాయ విముక్తుడ నౌవిధంబుగా
  నలఘుసమర్థతన్ భుజములందున గూర్పవె యోమహేశ్వరా!

(శృంఖలములను బలవంతముగఁ ద్రెంచివేయుచున్నాఁడు.)

భటులు—(గడగడ వణకుచు పాఱిపోవఁ బ్రయత్నించుచున్నారు.)

ప్రతా—(కరవాలము లాగుకొని) ఓరి పిఱికిపందలారా! ఇప్పు డెందుఁ బోయెదరు?

ఉ. మేము సుషుప్తి నున్నతఱి నించినవంచనఁ జేసి, యీగతిం
గావఁనివోలె హీనగతిఁ గట్ట దలంచినవాఁ డెవండు త
న్నామముఁ దెల్పరేని, రయమున న్నిముఁగాలునిపీటి కంపి పో
ద్దామదినేశమండలముఁ దాఁకఁగఁ జేర్చెద మ్లేచ్ఛశీర్షముల్.

(కత్తులు పిసుకుచు కత్తి నెత్తుచున్నాఁడు.

1—భటు మహారాజ్! నీకీ సలాం సేస్తాం మాకీ జాన్ భక్షీస్ దయా సేస్తే అంతా సెప్తామ్

2—భటు మహారాజ్! మాకీ ట్లాంక్ ఇడ్సిపెడ్తే- హంతా సత్తె సెప్తాం.

ప్రతా—(స్వగ) పాపము వీరు శరణురుచున్నవారు. వదలిన నంతయుఁ జెప్పెదరు (వదలి ప్రకా) మీప్రభు వెవ్వఁడు వచింపుఁడు— ఎవఁడు మీచే నిట్టికుకృత్యము నుఁ జేయించినవాఁడు?

భటు—మహారాజ్! హద్దగ్గో దూరానా హాగ్పడే జాగల్ లో— అటూ సూడండి మహారాజ్- హాక్కడా- దూరాన—

ప్రతా—అక్కడ నేమున్నది? (చూచుచున్నాఁడు)

భటు—(ఏమఱించి కాలికొలఁది పాఱిపోవుచున్నారు)

ప్రతా—(చిఱునవ్వుతో) ప్రాణభీతార్తులైన హీనజాతి పిఱికిపందలు- పాఱిపోవుచు వెన్నుజూపిన వీరిని వెంటాడి వధింపనేల?—ఏది యెట్లున్నను, నన్నుఁ బట్టవచ్చినవా రెవ్వరో యెఱుకపడదయ్యె- రాజ్యమున కేమియు విపత్తు రాదుగదా! మంత్రి యుగంధరుల వారును పురమున లేరు- ఐనను జనార్దనమంత్రి యీతురకల మోసంబున కాస్పద మిచ్చునా?

ఉ. ఎంతయు రాజ్యతంత్రము వహించెడు నేర్పున, నాయుగంధరుం
డంతగఁ గాకపోయినను నాతనితమ్ముఁడె కా జనార్దనుం
డంతము సేయఁడే తురకలం తగ గోటను ముట్టడింపఁ గా
లాంతక తుల్యులైన భటులందఱు నగ్గరె ఖడ్గపాణులై.

కావున పురమునకు భయము లేదు.

(అనుబంధము 2)

వలీ—(ప్రవేశించి, స్వగతము) కామ్‌తమాం ఖరాబ్ హోగయా— రాజాకా బహుత్ ఫక్కర్ జులుంమే పకడ్ గేనా.

(నిష్క్రమించును.)

ప్రతా—వెంటవచ్చిన సేనలు వెనుక చిక్కినవి. నాకరమున కరవాల మున్నంతవఱకు నా కేభయమును లేదు గాని, పురమున కరుగుట మంచిదా—హనుమాదోగ దూరంబున నున్నవాడు. పిలిచి యెవరో హింతునా?— (దూరమున లక్షించి) —హా! ఆకాశమంటునట్లు ధూళి రేగుచున్నది. ఇది సామాన్యమైన దాడి గాదు. మహాయుద్ధమే జరుగనున్నది. తలంచినట్లు ఢిల్లీనుండి యే సేనలు వచ్చియుండును. కానిమ్ము. చూతము. కృపాణమా! నీకు చక్కని విందు సుమా!

(తురకదండు వచ్చి నలుప్రక్కలనుండియు ప్రతాపరుద్రుని మూర్కొనుచున్నది)

ప్ర—(మహాగ్రహముతో)

ఉ. పాపపుబుద్ధిచేత నను బట్టగవచ్చితి రే! దురాత్ములా
రా! నగదీర మీశిరము లన్నిటి గండకలీల గాగ, నే
నేపున మీటిపై కెరుక చేసెద- బూటులు చిత్రరీతి నం
తాపముచేత నేడ్వ- వితథం బగు వార్భటి యేల రండిరా!

(కత్తిత్రిప్పుచు, చిత్రవైఖరి ననేక సేనలం గూలనేయుచున్నాడు; మిగత భటులు పలాయితులగుచున్నారు.)

వలీ—(ప్ర॥ స్వ) జులుంసే రాజాకూ పకడ్నేకూ హల్లాకూ భీతాఖత్ నహీంహై మాలుంహోతా— భీ దూసార్ రస్తా పకడ్నా— (ప్రకా

వలీ—తమరూ బంట్రోతులూ రక్షించినారూ యని- తెల్సినక్కా సిపాయిల్ అలాంగా సేసినార్- వోరంగోల్ మహారాజా అని తల్సి సేసిందిగాదూ- మీరు మకీనుకీ మెహర్బాన్ చేసి మమ్మల్ని రక్షించవాలా పార్థన చేస్తాం.

ప్రతా—ఏమిరా! నన్ను మాయమాటలచేత బుట్టలో బెట్టదలంచుచున్నావు నీనిజచరిత్రము చెప్పవేని- చూచితివా కరవాలము?

వలీ—మహారాజ్-మేం చెప్పింది నిచ్చయం. తమదయ వుండవాలా- తమకీ రత్నాలూహారంలూ నజర్లూకూడా తెచ్చినాం.

(దగ్గఱ దగ్గఱకు వచ్చి మెడలో రత్నహారము వేసినట్లు నటించుచు మత్తుమందు ముక్కుకు చూపుచున్నాఁడు.)

ప్రతా—మోసము; మో-స-ము—

(మూర్ఛిల్లును.)

భటు—(బంధింతురు)

(తెర వ్రాలును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# ప్రతాపరుద్రీయము.

## ద్వితీయాంకము.



### 1 వ రంగము :—గోదావరీతీరము.

[విద్యానాథుఁడు ప్రవేశించును.]

విద్యా —(స్వగ) ప్రకృతియంతయు మహాశ్చర్యకరముగా నున్నది. ఏమి కారణమో కదా! భూనభోంతరముల మధ్యమున నీరంధ్రముగఁ గ్రమ్ముకొనిన యీధూళి తురకల సేనలది గాక యింకెవ్వరిదై యుండును. రాజు వేఁటకు వచ్చినది యీప్రాంతమే! తురక సేనలు చీలివచ్చిన దీప్రాంతమే! రాజు నేమైన తురకలు గొని పోవుచున్నారా!—ఆమహారాజును బట్టుట కెవ్వరికి సాధ్యము! మోస మేమైన జరిగియుండునేమో ఎల్లిఖాఁడు సామాన్యుఁడు గాఁడు; (స్మరణ నభినయించి) ఐనను భయములేదు- గోదావరి దాఁటవలయునని, యుదయముండియు నే నెన్ని రేవులు తిరిగిన నొక్క నావగాని, బల్లకట్టుగాని, డింగిగాని, పుట్టిగాని- కాన్పింపలేదు. అన్నియును భిన్నభిన్నముల యి యున్నవి. దీనిం బట్టిచూడ- తురకలు గోదావరి దాఁటిపోకుండ, రాజతంత్రవిశారదుండగు జనార్దనమూర్తి యిట్టి కట్టడచేసి యుం

మనని త్రోఁచుచున్నది మంచికని చేసినాఁడు. తురక లేదారిని దాఁటిపోఁగలరు? (అటునిటుఁజూచి) చిన్నదండొకటి యీప్రక్క నుండి చనుచున్నది. ఇది తురకదండు కాదు. మహారాజువెంట వేఁటకై వచ్చినభటులై యుందురు వీరి కేమైన రాజువృత్తాంతము తెలియునేమో కనుగొందును. (తెరవంకఁ జూచి) ఓయీ భద్రముఖుఁడా! — భద్రముఖుఁడా!

[ఒకభటుఁడు ప్రవేశము.]

భటు — ఏమి స్వామీ?

విద్యా — మహారాజుగారి నరణ్యమున వదలి మీ రొంటరిగ నరుగుచున్నారేమి?

భటు — మహారాజుగారు శార్దూలమును దఱుముకొని వనమును చీలి వచ్చినారు. మాకు వారిదర్శనము కాలేదు. కాని వారియశ్వ మొంటరిగ నాకాశమార్గమున కోటదిక్కుగాఁ బోవుచున్నది. ఇది మా కాశ్చర్యమై- మహారాజును వెదకుచుఁ బోవుచున్నాము.

(నిష్క్రమించును.)

విద్యా — (తనలో) సరే! తలంచినది యథార్థమైనది. మహారాజు యవనహస్తగతుఁడు కానిచో నశ్వ మేల నొంటరిగ నరుగును? కటకటా! విధి యింత విపరీతమయ్యెనా! కష్టము లొంటరిగ రావను నార్యోక్తి ననుసరించి- జనార్దనమంత్రి శాసన మందని నావ యేదైన తురకలను- దాఁటించుటకే సిద్ధమైన నిఁక నడుగవలసిన పనియే లేదు.

[తెరలో]

ఏలేసా హైలే యేలేసా- ఐలేసా యేల బేలేసా-
జోర్సెయ్- బార్సెయ్-

విద్యా—(విని) ఇదియును స్థిరమే యైనదా! కానీ! వీరి వృత్తాంత
మేదియో కనుఁగొందును. ఇప్పుడా సింపరాదు.

ఆ. రాజు సహజముగఁ బరాక్రమవంతుఁడు
రాపు లేదు మంత్రిరత్నమున,
నయిన విధి విరోధ మాట నిట్లయ్యె నే
బ్రకటపఱతు నడుతభక్తి కొంత.

(నిష్క్రమించును.)



2 వ రంగము:—గోదావరీనదిమీఁద తురకల యోడ.

పడవవాండ్రు—

(ఒకఁడు చెప్పఁగా తక్కినవాండ్రందుకొని కోలలు వేయుచు పాడుదురు.)

పాట.

ఏలేసా యేలా యేలేసా-
ఐలేసా యేల బేలేసా-

జోర్సైగ్-బార్సైగ్-

1. గోదాఁతల్లికీ కోటిదణ్ణాలెట్టి
బద్రాశిలం తీర్త మెల్లాలే-
పొరుపులేకుండాను పోశెమ్మగండికీ
కొట్టాలకొబ్బరీ కాయలూ నూఁటొకటి॥ గో॥
ఏలేసా ఏల ..................... జోర్సైయ్-బార్సైగ్.

2. గోదాఁతల్లికీ కోటిదణ్ణాలెట్టి
కోటిలింగంతీర్త మెల్లాలే-
కట్టిసఁగుడికాడ మాసంది దేముడికి
పెట్టాలెడణ్ణాలు పేరుపేరొరసగా॥ గో॥
ఏలేసా యే.....................జోర్సైయ్-బార్సైయ్.

3 కష్టమేణమ్మకీ కోటిదణ్ణాలెట్టి
అమరోతితీర్తాని కెల్లాలే-
పొయ్యేటిదారిలో కనకదుర్గకి మొక్కి-
మొయ్యాలెరూపాయ లేటి గోదిగముడిసి॥ గో॥
ఏలేసా యేల......................జోర్స్యేగ్- బార్స్యేగ్.

4. కాయేరిటిల్లికీ కోటిదణ్ణాలెట్టి
శీరంగతీర్తాని కెల్లాలే-
అంటావోళ్ళముందర ఆగలేకుంటేను
శీరంగనాచికి సెప్పికొట్టించాలె॥ గో॥
ఏలేసా ఏల ఏలేసా.........జోర్స్యేగ్- బార్స్యేగ్.

1 పడ—బాబో! మొసలి మొసలాఁ!-
2 పడ—అబ్బా! మసినంత మొసలాఁ.
3 పడ—మొసలిగాదు ముసిలాఁ.
4 పడ—మసిసేనాఁ- మొసలిగాదు.
1 పడ—తనుకిలాడు తున్నాడాఁ.
2 పడ—సెయ్యిసిరి సైగ జేస్తుండాడాఁ పాపం.
3 పడ—అరెరే! పాపం బాపనయ్యరా!
4 పడ—మొసలీ యెంటబడ్డాదో యేంకర్మమో
1 పడ—సావుబతుకుల మీదుండాడాఁ
2 పడ—బలే యీతగాడాఁ.
3 పడ—తెగబడ్డాడాఁ.
4 పడ—తాడిసరండశ్శే

[ తెరలో. ]

ఓహోహాయ్- పడవ్వాళ్ళోయ్- పడవ్వాళ్ళా- సాయెబులూ-సాయెబులూ- చచ్చితి- రక్షించండి- మొసలి- మొసలి- మొసలి!!

1 పడ—నవాబుగారూ! ఆ బాపనయ్య నస్తున్నాడు పాపం! మొస
లంట! యెక్కిస్తున్నాం!

సాహే—యెక్కించండీ పాపం! నస్తాడు.

[విద్యానాథుఁడు ఈదుచు ప్రవేశించును.]

ఓహోయ్- పడవా ళ్ళోయ్- పడవ్వాళ్ళూ- సాయేబులూ! సాయేబు
లూ- సాయేబులూ- చచ్చితి- చచ్చితి- రక్షించండి- మొసలి-
మొసలి! మొసలి !!

2 పడ—తాడేస్తున్నాం- వుండు బాపనయ్యా- బయంనేఁలే- (పడవ
వాండ్రు తాడు వేయఁగా విద్యానాథుఁడు పట్టుకొని పడవపైఁ
జేరును)

విద్యా—ఊహుహుహుహుహుహుహూ! అబ్బబ్బ! ఏమిచలి! ఎంత
చలి! వరే! పడవవాళ్ళూ- మీరు లేకుంటే యివ్వాళ్ళ చచ్చి
పోదును రా!- సాయెబులూ! మీరు దయదల్చకుంటే ప్రాణం
పోయియుండును.

(అని బట్టపిండుకొనుచు వణకును. తట్టంతయు తడిచేయుచున్నాఁడు)
అబ్బా! ఎంతపెద్దమొసలి! ఎంతపెద్దమొసలి!!

ఒకసిపాయి—మరీ- యిలాంటి మొసళ్ళలో యింతాసాహసం యెం
దుక్కూ పేచినావ్ సాస్తుల్లూ?

విద్యా—(స్వగ) ఈ నాలుక కిదియే మొదటి యనృతము- చేయునది
రాజసేవ— శుక్రనీతి యుండనే యున్నది. (ప్రకా) నాలుగు దిన
ములక్రిందట నా భార్య మగశిశువును ప్రసవించినది. బాలుఁడు
పుట్టిననాఁడే గిట్టినాఁడు. తల్లి కిప్పుడు ప్రసూతిజాడ్యము ప్రవే
శించి చావబ్రదుకుల మీఁద నున్నది. వైద్యుఁడు గరళము తెమ్మ
ని చెప్పఁగా- దోనెమీఁద గోదావరి దాఁటి యొక యోగి తిండిస
యితమువారి, మూఁడుకోసులలో నున్న మాడపాడికిఁ బోయి

గురిజము తెచ్చి మాతుమ్మడుగారు యే దేశమందును పడవలేదు. డింగీ లేదు. అన్నీ వరుసగా కొట్టబడియున్నవి. అక్కడో మంత్రి శాసనమును చెప్పుచున్నారు. అయ్యో యిప్పుడు నాకేమి పోగాలమో!

అందఱు—హాశ్చర్యం- హాశ్చర్యం.

విద్యా—తరువాత గోదావరి మీఁద కేఁ పోవుదునా యని తెగించితిని. ఈమొసళ్ళు వెంబడించుచున్న దాటియే యుందును.

సిపా—గోదావరీ యీతామీద దాటేవ క్కేవుంది పాస్తుల్లా నీకీ ?

విద్యా—వెనుక మొగసాగు పరీక్షగాంగా- చేతులు కాళ్ళు తాళ్ళతో కట్టించుకొని, మొగముమీఁద నూనెగిన్నె పెట్టుకొని నూనె నోటికింద నేను సార్లు కట్టుతాకమీఁద నీవలావలికి గోదావరి కడ్డమీఁదిన యీఁతగాడను సాహెబూ.

సిపా—బలే- బలే- బడాయీతామన్సీ- బడాయీతామన్సీ

1 పడవ—ఆ బ్యాక్నరవా బాబూ నువ్వా. వాడానో అనుకున్నాం- దండం బాబూ!

విద్యా—నేనే మోంగ్లుబోను.

2 పడ—ఎవర్రి—

1 పడ—ఎవరనుకొంటావ్రి- మొయ్యగూపాయలుగూడా గెల్చుకున్నాడు. వాడ్డి గూడా కాడ

2 పడ—అల్లాగువార్రి బాబూ- వానికెవరో అనుకున్నాను.

విద్యా—(స్వగ) ఇక్కడ నేనియునులేక- అందఱును తురకలు- లోపల మహారాజుండవచ్చును. (గడగడ వణకుచు) బాబూ! జ్వరం- జ్వరం- అయ్యయ్యో! చలి. చలి. ఉహుహుహుహు హుహుహు.

సిపా—కూకుండేసోటా నీళ్ళా సేసుకు సొస్తుల్లా- సలి గిలీ పోతుందీ లోపలికీయెల్లూ- ఇద్గో ద్వారి- ఇలాగా యెల్లూ.

విద్యా—ఛీ హుం హుం హుం హుం-

(వణఁకుచు లోపలకుఁ బోవును)

3వ రంగము.—సదన లోపలి భాగము.

[ఆసీనుఁడై హరిశ్చంద్రుఁడు బాహ్యబాధవముతో]

హరి—(స్వగ) నిరాయుధుండు గదా యని నమ్మి వల్లీఖానునిచే నెంత మోసపోయితిని!- ఓరీ వల్లీఖానుఁడా! వల్లీఖానుఁడా!-

ఆ. పాత్రమంగాఁ జల్లి మముఁ బట్టఁగల్గితి
గాసి సాహసమున ఖడ్గమూని,
కలనఁ గెలిచి మమ్ము గెలువ నీతర మానె
పాపి తురకబుద్ధిఁ జూపినావు.

ఒకరి ననవలసినపని యేమున్నది? ఇది నాకర్మానుభవము.-!

(అనుబంధము 3)

సీ. సాధుజంతునితాన సంహారపాపంబు,
వారణంబుగ తలఁ దగిలెనేమొ?
కాననోపాంత దప్పకలితులు మృగయూథి
నోదంబులకు మది నొచ్చెనేమొ?
చేరి యర్థులకు నిచ్చెదనంచు నమ్మించి
తడబాటునఁ బరాకు పడితినేమొ?
దండింపఁదగని యుత్తముల నెవ్వరినైన
దండించితినొ ప్రమాదంబుచేత?
శ్రీశివార్చనము నుపేక్షఁ జేసినానొ?
మాతృపూజావిధానంబు మఱచినానొ?
బ్రాహ్మణుల నవమానంబు బఱచినానొ?
ఇట్టి ప్రాప్తి ఘటించిన హేతు వేమొ?

అకటా! రాజై జన్మించుట బహుభారవహనమూలకము గదా!

ఆ. పూఁట కూలిఁ జేసి, పాలుపార భుజియించు
పేద నిదురఁ జెందు పాదమెఱచి,
కనక పాత్రమందు కలమాన్నము భుజించు
నవనివిభుఁడు నిదుర నందలేఁడు.

బాంధవ సంస్మరణంబున నాకెంతయు విచారము గల్గుచున్నయది.

సీ. నాపైనఁ దనదు ప్రాణములు నిల్పినవృద్ధ
జనని యెంతగ మది వగరు నొక్కొ?
సతతంబు నాతనుచ్ఛాయగా నొప్పు, కు
లాంగన యేరీతి నడలు నొక్కొ?
భావికాకతివంశవర్ధనం బగుముద్దు
పట్టి యెంతగ నార్తి పడయు నొక్కొ?
తల్లిఁబాయు పుత్రికుల భాతిని రాష్ట్ర
జనము లేగతి నార్తి గనెద రొక్కొ?
కటకటా! మ్లేచ్ఛపాలన కారణమున,
గోమహీసురవధములుఁ గొల్లగొనుట
లబలలఁ బరాభవించుట లాదియైన
దురితకర్మంబు లిఁక నేనిఁ జరుగు నొక్కొ?

తల్లీ! కాకతీయసామ్రాజ్యలక్ష్మీ!

క. తల్లీ! కాకతి రాజ్యము
తల్లీ! నను మలకలకు వదలితివటంచుఁ
దల్లడిలకు మమ్మా! భగ
వల్లీలను గడవఁగఁ దరమె వనజభవునకున్.

ఎవ్వరో బ్రాహ్మణుఁడు గోదావరి నీఁదుచువచ్చినాఁడు. ఇతనిమాటల
వలన తురకలు గోదావరిని దాఁటకుండ జనార్దనుఁడు చేసిన

ప్రయత్నము తెల్లమైనది. మహామాత్యు లెప్పుడును ప్రమత్తులు కాఁజాలరు.

[విద్యానాథుఁడు వణకుచు లోపల ప్రవేశించి

విద్యా—అబ్బా! చలి-చలి-చలి-ఉహుహుహుహుహు- లోపలనంతయుం జీఁకటి; ఒక్కక్షణ మలవాటుపడినఁగాని యేమియుఁ గనఁబడదు

[వస్త్రములలోనున్న లోఁటిసంచినుండి విభూదిదీసి యొడలినిండఁ బూసికొని, పుస్తక మొకటి తెఱచుచుండును.]

ప్రతా—(స్వగ) ఈమహానుభావుఁ డేదియో గ్రంథము విప్పుచున్నాఁడు.

విద్యా—(పుస్తకమును విప్పి రాగముగా)

* శ్లో॥ క్రీడాద్రీయతి గోత్రశైల శిఖరేష్వాస్థాన సద్మీయతి
ద్వీపేష్వాబ్ధిషు దీర్ఘికీయతి హరిత్స్వేకాంత గేహీయతి
ఉద్యానీయతి సీమపర్వతతటారణ్యే సుపర్వాచలే
ప్రాసాదీయతి వీరరుద్రనృపతే స్ఫారఃప్రతాపోదయః॥

ప్రతా—(స్వగ) ఆహాహా! రసవంతమైన కవిత్వము! ఏమికావ్యమండీ అది శాస్త్రిలవారూ?

విద్యా—(కలయఁజూచి) ఏమిది? నాకు తోడుగా నిచ్చట నింకొకరున్నారా?

ప్రతా—ఏమికావ్యమది?

---

* వీరప్రతాపరుద్రదేవుని ప్రతాపకీర్తి-గోత్రశైలశిఖరములను క్రీడాపర్వతములుగను, ద్వీపముల నాస్థానసద్మములుగను, సముద్రములను స్నానంపు గొలఁకులుగను, దిక్కుల నేకాంతమందిరములుగను, పర్వతతటారణ్యముల నుద్యానములుగను, సుపర్వాచలముం బ్రాసాదముగను జేసికొనెను. అనగా ప్రతాపరుద్రునికీర్తి చొరని ప్రదేశము లేదని భావము

విద్యా—(స్వగ) ఎవరీమహాపురుషుఁడు? కానీ విచారించెదను. (ప్ర)
ఈకావ్యమా? ఇది ప్రతాపరుద్రీయ మనునలంకారశాస్త్రము!
ఓరుగంటి ప్రతాపరుద్రునిపై నంకితము చేసితిరి!

ప్రతా—అతనిపై నేల చేసితిరి?

విద్యా—బీదవాఁడనగుటచే నేమైన సన్మానమునచోఁ గుమార్తె వివాహము చేయుదమనుకొంటిని.

ప్రతా—సన్మాన మేమి జరిగినది?

విద్యా—సన్మాన మెక్కడిది?

ప్రతా—అంత యరసికుఁడాయా రాజు?

విద్యా—దర్శన మే కలుగలేదు; సన్మాన మెట్లుజరుగును?

ప్రతా—దర్శన మేల కలుగలేదు?

విద్యా—నాఁ సమునుండి రాజు పురమున లేఁడు.

ప్రతా—ఎక్కడి కరిగెను?

విద్యా—ఎవ్వరెఱుఁగుదురు? కొందఱు వేఁటకనిరి. కొందఱు చారిగా సికనిరి. కొంద ఱింకేమోయనిరి. విసుగుపుట్టి యింటివారిఁ బట్టుచుంటిని.

ప్రతా—అంతప్రయాసమున నాయనకే యంకిత మేలచేయవలయును? మఱియొక వదాన్యభూపతి లభింపకపోయెనా?

విద్యా—అట్టియవకాశ ముండిన నితరోద్యమ కేల సహించుచుంటిని.

ప్రతా—ఎందుచేత?

విద్యా—అంతటను వానినే తగులవేసితిని.

ప్రతా—(స్వగ) కటకటా! ఎట్టిమాట వినవలసిన దుష్కాలము వచ్చినది. కట్టినసుదినమున నన్ను సిరి వదలిన దనిన నాశ్చర్య మేమి? (ప్రకా) మహాత్మా! రెండుమూఁడు శ్లోకములను చదువుఁడు. ఆలకించి యానందించెదను.

విద్యా—రసజ్ఞులు విని సంతసించుచో కవికి కనకాభిషేకము గదా! అవధరింపుఁడు.

§ శ్లో॥ లోకే కాకతివీరరుద్రనృపతే రుద్దామభూమశ్రియః
కీర్త్యా కార్తిక కౌముదీధవళయా తుల్యం నకించిత్క్వచిత్
యన్మాధుర్య విజృంభితక్షతవిషాం గ్రీవాం విలోక్యాధునా
కంఠాలింగన మీశితుః వితనుతే నీరంధ్రముద్రోన్నతా॥

రాజు—ఆహాహాహా! ఇది యమృతప్రవాహము గాని కవితాప్రవాహము గాదు. ఏది శాస్త్రులవారూ! మఱియొక శ్లోకము?

విద్యా—

† శ్లో॥ ప్రతాప శ్రీతుల్యం క్వచిదపి నభూతం నచభవన్న భావి
త్రైలోక్యే కిమపి ప్రజైనః కాకతివిభో యథా
లోకాలోకక్షితిధరతటే వ్యర్కదృషదః
ప్రకాశంతే నక్తందివ ముదితరోచిః ప్రచయాః॥

---

§ ప్రతాపరుద్రమహారాజుయొక్క కార్తికమాసమునందలి వెన్నెలవలె తెల్లనై యున్న కీర్తి ప్రపంచమంతటను దట్టముగ వ్యాపించినది. ఆ కాంతి సహజముగ తెల్లనై యున్న శంకరుని శరీరమును మఱింత తెలుపుగావింప నానందముతో సర్పము లాతని శరీరమునందంతట మఱింత బలవంతముగఁ బెనవేసికొనుచున్నవి. పార్వతీదేవి యిదిచూచి సంపూర్ణముగ తెల్లనైనచోఁ దన భర్తను గుర్తింపఁజాలకుందు ననుభయమున కంఠము నందలి మచ్చమాత్రము తెల్లబడక గుఱుతుగా నుండునిమిత్తము కంఠమును రెండుచేతులఁ బెనవేసి గట్టిగాఁ గౌఁగలించుకొనుచున్నది.

† ప్రతాపరుద్రమహారాజు కీర్తివంటి కీర్తి మూఁడులోకములందును యిదివఱ కుండలేదు; ఇప్పుడులేదు; ఇఁకముందుండదు; ఆయనకీర్తి కాంతిసోఁకుటచేత లోకాలోకపర్వతమునందున్న సూర్యకాంతమణులు రాత్రింబవళ్ళనువిచక్షణలేకుండ మహాకాంతితోఁ బ్రకాశించుచున్నవి. (లోకాలోకమను పర్వతము ప్రపంచమును చుట్టియుండునని పురాణవృత్తము) ఇట్లు చెప్పుటచేత ప్రతాపరుద్రమహారాజు కీర్తి మహాకాంతితో ప్రపంచములను దాఁటినదని భావము.

రాజు—(ఆనందముతో) కవిచంద్రమా! ఇట్టి రసవత్తరంబగు కావ్య
బాలికం గన్న తమకు ధన్యులే కాని కృతినంది మిమ్ము సత్క
రింపఁజాలకపోయిన రాజు మిగుల నిర్భాగ్యుఁడు సుఁడీ!

విద్యా—కూఁతును పతి కర్పించి చేతులు కడుగుకొన్నప్పుడుగదా జనకుఁ
డైనను గృతార్థుఁ డగుట! ఇది వినుఁడు.

‡ శ్లో॥ కుందతి కుముదతి హంసతి
హారతి హరతి క్షపాకరతి
కైలాసతి చ యశశ్శ్రీ
వైశద్యం వీరరుద్రభర్తుః॥

ప్రతా—(మహానందముతో) కవిశ్రేష్ఠమా! మీరు భూమి నవతరిం
చిన కేవల విద్యాధనులుగాని సామాన్యులు గారు మహాత్మా!
రిక్తుండను. ఇఁక నేమి ప్రయోజనము. ఇప్పుట కేమియు లేదు
సరికదా నమస్కరించుటకు చేతులైనను స్వాధీనమున లేవు.
నాయంగేలోన ముద్రాంగుళీయ మున్నది—"రసగాననిధి కవి
గాంచును" గదా! దానిని గైకొని యెల్లుపయోగింపఁదగు నట్లు
ప్రయోగింపుఁడు కాల మనుకూలమైనప్పుడు ఫలము గాంతురు
గాక!

విద్యా—(పుచ్చుకొని—"ప్రతాపరుద్రమహారాజు" అని చదివి విస్మ
యముతో) శ్రీమన్మహారాజాధిరాజా!

సీ. ఏవానిదానధారావారి మున్నీరు
గా ధాత్రి కెల్లనగడ్త యయ్యె
నెవని ధాటికి శత్రునివహప్రతాపంబు
బడబాగ్నిరూపమై వనధిఁ దాఁగె

‡ ప్రతాపరుద్రమహారాజుయొక్క కీర్తికాంతి మల్లెపూవువలె, తెల్లకలువవలె, హంసవలె, హారతికర్పూరమువలె, శంకరునివలె, చంద్రునివలె, కైలాసాచలమువలె తెల్లనైయున్నది. (శబ్దాలంకారము.)

ఎవని యైశ్వర్యవైభవము వీక్షింప వ
జ్రాయుధుండు గనుల వేయి దాల్చె
ఎవని సౌందర్యంబు నెఱిఁగి భావజుఁడు ల
జ్జాన్వితముఖుఁడై యనంగుఁ డయ్యె
ఎవని దీప్తి కోడి రవి మింటఁ బరివేష
మండలాంతరమున మాటు వడియె
నరిమదేభసింహ వరబాహుమండిత
కాకతీయరుద్ర! కాంతిభద్ర!

సీ. కార్తికపూర్ణిమాకలితాచ్ఛసంపూర్ణ
విమలచంద్రికలతో సమత నంది
నవవసంతాశేషభవసాంధ్యమల్లికా
ప్రసవసంతతులతో బంతి నాడి
మందాకినీవారిసందోహమాలికా
హల్లీసకములతో నవఘళించి
తరుణసతీపయోధరభారవర్తితా
హారవల్లరులతో నారఁగి పెనఁగి
సమదదిగ్దంతిదంతవిస్తారధావ
ళ్యగోత్రులతోడ మంతనము లాడి
కాంతి నీకీర్తి లోకవిశ్రాంత మయ్యె !
వీరరుద్రమహారాజ! విపులతేజ !!

కాలమహిమం బసాధ్యము! లంఘింప నసాధ్యమైనది. భగవత్కటాక్షమున శీఘ్రకాలంబున కాకతీయరాజ్యసింహాసనంబుననే తమ పునర్దర్శనంబు నా కగుఁ గాక!

ప్రతా—మహాత్ముల యాశీర్వచనము వ్యర్థము కాదు గదా!

విద్యా—ఇంతే కాదు. మహారాజసార్వభౌమ !

జగ్గా—ఆలోచించిన ప్రయత్నము చేయుచు తమరాక కొరకు చూచుచున్నాను.

యుగం—(స్వగతము) అడవి కరిగిన ప్రభువు మరలి రాలేదు. చీలిపోయిన తురకదండును రాలేదు. ప్రభువును తురకలు పట్టుకొని పోయియుందురా? (నిమిత్తము సూచించి) సూచనలట్టులే యున్నవి; కాని చూతము—

[భటుండు ప్రవేశించును.]

భటు—మహామంత్రిగారికి జయము!

యుగం—(స్వగతము) తొలుత దుర్నిమిత్తమైనది; వెంటనే జయశబ్దము చెవిసోకినది. ఇది ప్రయత్నసాఫల్యము. (ప్రకాశముగా) ఏమిరా యది?

భటు—జమీందారులు- సరదారులు- సామంతులు- వచ్చి దర్శన మపేక్షించుచున్నారు.

యుగం—రమ్మనుము.

[అందఱు ప్రవేశము.]

అందఱు—మహామంత్రిగారికి జయము.

యుగం—అర్హాసనముల విశ్రమింపుండు.

(అందఱుం గూర్చుందురు)

యుగం—మీ తాత్పర్యఫలితము పూర్ణముగాకుండ నన్నుం బిలిపించితిరి. మీరందఱు కొంత ప్రయత్నములో నుండగా నేను రావలసిన యవసర మేమి?

విశ్వా—మేము గొడ్డలిం జేయుదామని మీరు గొంతులు కోయుదురు.

యుగం—(స్వగతము) ఆ తటి యవస్థ యిప్పుడు మాకే పట్టునట్లు తోచుచున్నది ప్రభువు స్థితి యెట్లున్నదో!

[భటుఁడు ప్రవేశించును.]

భటు—మహామంత్రివారికి జయము.

యుగం—విశేష మేమి?

భటు—(చీటి యిచ్చును.)

యుగం—(స్వగతము చదువుచు)

"ఆ. విష్ణువర్ధను నీర్ష్య వింతగా మశకంబు
క్రోతి గజము నీడ్చుకొనుచు నరిగె
చెడియెఁ గార్య మిపుడ జేయుమంత్రాంగంబుఁ
గోరివచ్చువాఁడ గ్రొత్తవాఁడ.

విద్యానాథుఁడు."

అనుమానము ప్రమాణ మయ్యె. రాజును తురక లీడ్చుకొనిపోయిరని సూచించుచున్నాఁడు. క్రొత్తవాఁడైనను చతురుఁడు ఛందోబద్ధముగ రచించినాఁడు. పేరు విద్యానాథుఁడఁట! కవియై యుండఁబోలు. విశ్వాసార్హుఁడని తోఁచుచున్నది. (ప్రకాశముగా) సరే! ఆయనం బ్రవేశపెట్టుము

భటు—(నిష్క్రమించును)

[విద్యానాథుని ప్రవేశము]

యుగం—(పరికించిచూచి స్వగతము) మహాతేజశ్శాలి. కన్నులలోన విజ్ఞానము—విశ్వాసము—సత్యప్రవర్తనముఁ గనఁబడుచున్నది. ఇతనివలన కార్యభంగము జరుగదు. (సాభిలాషముగ వచ్చి కౌఁగలించుకొని) విద్యానాథుఁడగు క్రొత్తవాఁ డనుకొంటిని. నా ప్రాణమే నా?

విద్యా—(కౌఁగిలింతలో చెవిలో) రాజును తురక లెత్తుకొనిపోయినారు.

యుగం—ఎన్నాళ్ళకు-ఎన్నాళ్ళకు !!-(మరలఁ గౌఁగలించుకొని చెవిలో) సిరిపురమున శ్రీధరశాస్త్రి యింట వ్యాధిలో నున్న ట్లుత్తరము,

తెప్పించుము. (ప్రవేశించి) కూర్చుండుము; తమ్ముఁడా! కూర్చుండుము—ఎవఁడురా అక్కడ?—కుర్చీ యేది?

(భటుఁడాసనము వేయును)

విద్యా—(కూర్చుండును.)

జనా—ఆహా! చిన్నన్నయ్య—ఎన్నాళ్ళకు! గుఱుతే పట్టలేక పోయితిని. (నమస్కరించును.)

విద్యా—(లేవనెత్తును)

యుగం—తమ్ముఁడా! ఇరువదేండ్లనుండి అన్నను—అన్నదమ్ములను గృహమును మఱచియేపోయితివా?

విద్యా—చిన్నతనమున నేను విద్యావిహీనుఁడనై యున్నపుడు-నీపేరు నేతిబీరకాయకు నెయ్యున్నదని తమ రంటిరి. ఇప్పుడది సార్థకము చేసికొని దర్శింపవచ్చితిని.

యుగం—ఇప్పుడామాటలచే నన్ను దెప్పుచుంటివా! జనార్దనా! నీకానాటిమాట జ్ఞప్తియున్నదా?

జనా—ఆహా! జ్ఞప్తిలేకేమి? నా కప్పటికి చాల చిన్నతనమైనను కన్నులఁ గట్టినట్లు జ్ఞప్తికివచ్చుచున్నది.

యుగం—నేను నిన్నట్లు చీవాట్లుపెట్టుటచేతనే నీ వింతవాఁడవైతివి సుమా!

విద్యా—అంతయు నన్నగారి యాశీర్వచనఫలము.

యుగం—నీజాడఁ గానక పదేండ్లకాల మన్మాకంటికి మంటి కేకధారగా నేడ్చినది. జగన్నాథక్షేత్రమున నీవు శివానందజ్యోతిష్కుని వద్దనున్న గండపెండేరమును గెలుచుకొన్నపుడు మాకు నీవార్త తెలిసినది. విద్యానాథా! నీప్రధానవిద్యాగురువు—ఆయన పేరు మఱచితిని.

విద్యా—దిగ్గజవిద్యాపండితులు.

యుగం—వా రొకమా రిటకు రాజదర్శనమునకు వచ్చినపుడు నీక్షేమవార్త నెఱిఁగించిరి. వారు క్షేమమా?

విద్యా—క్షేమమే—కాశిలోనున్నారు. ఆశీర్వచనముల నందియే వచ్చితిని.

యుగం—తమ్ముఁడూ! అమ్మను-చిన్నన్నయ్యను చూపించు- తరువాత మనము సావకాశముగ మాటాడుకొనవచ్చునులే- తమ్ముఁడు రావలయునని యమ్మ మ్రొక్కుకొనిన ముడుపులన్నియు నేఁడు చెల్లించును. చిన్నన్నయ్య భోజన మెప్పుడుచేసెనో విచారించుకో- మరల జగన్నాథము—కాశి—వెళ్ళకుండ చూచుకో- భోజనానంతరము కొంతజ్యోస్యవినోదమును గావింతము.

(జనార్దనుఁడు, విద్యానాథుఁడు నిష్క్రమింతురు)

యుగం—(అందఱితో) ఈవిద్యానాథుఁడు మాపినతల్లికొడుకు-

ఆ. చిన్ననాఁట నితని జననితోఁపాటు
మాజననియె పెంచె మమతమీఱ
ఖ్యాతి గాంచినట్టి జ్యోతిష్కుఁ డీతఁడు మ
హీతలేశుస్థితి వచించు నిపుడె.

[విద్యానాథ జనార్దనులు పునఃప్రవేశము.]

(పేరిగాఁడు వచ్చి విసరుచుండును.)

యుగం—(విద్యానాథునితో) తమ్ముఁడూ! కొంచెము వీరికి జ్యోతిషము చెప్పి వినోదింపఁ జేయుదువా?

విద్యా—తమ సెలవుప్రకారము చేసెదను. (ఒకజమీందారునుజూచి) తమకు చెప్పుదునా?

యుగం—మీ రాశిమీఁద నుండుఁడు.

(ఏదో వ్రాయుచుండును.)

జమీం—నా జాతక మిక్కడ లేదు.

విద్యా—అక్కఱలేదు. ఇది యథార్థజోస్యము. దీనికి చేయిచాలు. (చేయిచూచి) మంచిజాతకము. నాలుగేండ్లనుండియు ననుకూల గ్రహము లుచ్చస్థానములందు పనిచేయుచున్నవి ధనము సమృద్ధి- పలుకుబడి యధికము- భువనగిరి పరిపాలనము- పేరు శివరామరాజు- నలువురు పుత్రులు- కళత్రనష్టము- ద్వితీయ వివాహము—చాలునా?

జమీం—(ఆశ్చర్యముతో) అంతయు యథార్థము చూచినట్లు చెప్పినారు మహాజోస్యులు.

విద్యా—(విశ్వాసరావుతో) తమచేయి చూతునా?

విశ్వా—చిత్తము.

విద్యా—(చేయిచూచుచు) తమ కాదిత్యునిలో గురుడు పనిచేయుచున్నాడు. నామధేయము విశ్వాసరావుసామణి; పుత్రిత్రయము- మాటకారి- సతి మహాసతి- యోగజాతకము- అన్వర్థనామధేయము.

విశ్వా—(మహాశ్చర్యముతో) మీ వాక్యము బ్రహ్మవాక్యముగా నున్నది. కొంచెము గతము చెప్పుడు తార్కాణగా—

విద్యా—(రహస్యముగా) ఐదేండ్లక్రిందట— హరిపురపురాజయిన యశశ్శింగరవర్మను గాపాడుటకై యన్నగారి చేవ్రాలుచేసి వీరిశెట్టినుండి లక్షరూపాయలు తెప్పించి ఖజానాకు జమకట్టించి తిరిగి వారముదినములలోగా నన్నగారు పంపినట్లు శెట్టికి పంపితిరి గదా!

విశ్వా—(పాదములపైబడి) బాబూ! ఈయన వాచస్పతియో బృహస్పతియో కాని మానవుడు గాడు. ఆరహస్యమునుబయట వేయక నన్ను కాపాడవలెను.

విద్యా—భయము లేదు. లెండి. ,తారాగణకొఱకు చెప్పితిని. (పేరి శెట్టినిచూచి) మీకు చెప్పుదునా?

వీరి—చెప్పండి.

విద్యా—(చేయిచూచి) కోటరూపాయలకు కొంచెము తక్కువగా నిలువ- కొలదిదినములలో దూరదేశమునకు నౌకాయాత్ర- కార్యవిజయము - జాతకమున లక్ష్మి తాండవించుచున్నది......
ఇంకొకరహస్యము గలదు. చెప్పుదునా?

వీరి—(భయముతో) చెప్పండి.

విద్యా—విష్ణుమూర్తికి నాభియందు- బ్రహ్మదేవునకు వృష్ఠమునందు- లక్ష్మీదేవికి చేతియందు గలది మీకు వీపున నున్నది

జనా—తామర కాదుగోలును.

వీరి—(సిగ్గుపడుచున్నాడు.)

అందఱు—(నవ్వుచున్నారు.)

పేరి—(తెల్లపోయి నోరు తెఱుచుకొని వినుచుండును)

వీరి—ఈపేరిగానికి చెప్పండి స్వామీ !

విద్యా—రా-రా- ఇటురా- మంచి పరీక్ష మగుచేయి దొరికినది. విద్యకు ఫలము.

పేరి—(గడగడ వణకుచు) నాను తీలేదండి- నానెరగనండి- సూసు కోండి.

(చేతులు బోర్లించి చూపును.)

విద్యా—(స్వగ) ఇదేదిమో ఈ సమస్య మా కింకను విడుటలేదు. (ప్రకా) చాకలి పేరిగాడు- వీని పెండ్లాముపేరు యెల్లి.

పేరి—బాబూ- బాబూ- ఎల్లితీలేదండి- నేనూతీ లేదండి-పెమానం బాబూ- పెమానం.

విద్యా—ఏమీరా నీవు తీయనిది?

పేరి—తమరి శేతుంగర నుండి

విద్యా—తీయుచున్న - పోయినయుంగరము మాట నీకెట్లు తెలిసినది రా?

పేరి—లిమ రాకిశెయ్యి సూసి—యాకిసెయ్యి సూసి—వొగ్గేయటం—
(వీరిశెట్టినిచూపి) చెట్టిగోరు వామీాదెట్టటం—నానుసూపునే
దుండి బాబూ!

విద్యా—(వీరిసెట్టితో) ఏమయ్యా! సెట్టిగారూ! చాకలి లోకువయని
దొంగతనము వానిపైఁ ద్రోచితివా?

అందఱు—(నవ్వుచున్నారు.)

వీరి—ఏమిరా! నేను నీపైఁ బెట్టితినంటరా!

పేరి—నే నెఱగనుండి సామీ!

జనా—ఉంగరము కాదురా! మూఢుఁడా! జోస్యము చెప్పుచున్నారు రా!

పేరి—తెలిసి మూరుగిన్ణి బాబూ! రక్షించండి

విద్యా—ఏది నీకు జోస్యము చెప్పెదను చేయి చూపించు.

పేరి—సేతి కుంగరా లక్కర్లేదు బాబూ?

విద్యా—ఉంగరము లెందుకు? వట్టిచేయి చూపుము.

పేరి—(బోర్లించి చూపును.)

విద్యా—త్రిప్పిచూపరా!

పేరి—(త్రిప్పి ఎడమచేయి చూపును.)

విద్యా—కుడిచేయి చూపరా!

పేరి .(కుడిచేయి చూపును) తెలనోణ్ణండి బాబూ! నముబుకున్నదవని
గానండి.

విద్యా—భేష్ విద్యావంతులకు మంచిబిరుదు.

అందఱు—(నవ్వుచున్నారు)

విద్యా—(చెయిచూచి) హీఁ డీనదుమ నల్లిత్తో విరోధపడి—

పేరి—(విద్యానాథుని కాళ్ళమీాదబడి) బాబూ! బాబూ! అచంగతి

మా త్తగం సెప్పకుండి బాబూ! నాసి త్తగిపులు మణవి సేసు
కోండి మారాజా !

జనా—అయ్యో! పాపము వాఁడు చిత్తగించుకొనుచున్నాఁడు; జాగ్ర
త్తగా మనవి చేసుకోండి.

విద్యా—(అగ) ఇంకముందు మనమందఱ మట్లే మనవి చేసికొందము.
(పేరిగానితో) నీకు తగ వేలవచ్చినదిరా?

పేరి—అయ్యండీ నన్ను పేరిగా— పేరిగా— అని పిలిసింరండి. నా
నలాగ పిల్వొద్దన్నానండి

విద్యా—ఏమని పిలవమంటివి?

పేరి—'మారాజా' అని పిలమన్నానండి

విద్యా—(స్వగ) వీని కప్పుడే రాజయోగము గల్గు బుద్ధులు పుట్టినవి.
(ప్రకా) మఱి అట్లు పిలిచినదా?

పేరి—వొకపాలుండి "నన్ను మారానీ అంటే నిన్ను మారాజా అంటా"
నన్నదండి—ఆపాట్యా—నేను మారానీ, అన్నానండి—
దొంగనంజెకూతు—(సిగ్గు పడుచున్నాఁడు)

విద్యా—(నవ్వుచు) భయములేకపోతే—అది నీజాతీయ భాష—చెప్పు
చెప్పు

పేరి—తెలవోణ్ణి బాబూ—మణవి సేసుకోండి

విద్యా—మనవి చేసుకున్నానులే—చెప్పు.

పేరి—ఆపాట్యా దొంగనం—(మాటతిప్పుకొని) యెల్లుండి నన్ను
'మారానీ' అన్లెప్పి—నవ్వుకుంటా—దూరంగా యెల్లి పేరి
గా అన్నదండి.

అందఱు—(నవ్వుచున్నారు.)

విద్యా—అప్పుడు నీవూరకుంటివా?

పేరి—అప్పుడు నాకు కోప మాగలేదు బాబూ! యెగురుబాంగట్లు

కొచ్చి యీపిరంగి మోదినాను బాబూ!

విద్యా—అప్పుడది యూరకున్నదా?

పేరి—అది మురికిగుడ్డలమూట వాన తినేశింది బాబూ!

విద్యా—శేబాష్- మంచిప్రాసగలవాక్యము- అచ్చజాతీయము.

పేరి—ఇదేనండి బాబూ! నేను సెప్పొద్దని శిత్తగించుకొన్నది.

విద్యా—దీనిని మేము చెప్పములే- భయపడకు.

జనా—అదిమాని పాప మింకేమయిన జోస్యము చెప్పుము.

విద్యా—(చేయిచూచి జాలితో పేరిగానింజూచి) అయ్యయ్యో! ఎట్టి గడియలు వచ్చినవిరా పాపము! నీ కింకేమిచెప్పను! విన్నకొలంది బెంగ పెట్టుకొని చత్తువు—వెళ్ళు—అవతలికి.

(పేరిగాఁడు దుఃఖపడుచు దూరముగ నుండును.)

జనా—వీనిగతి యేమున్నది పాపము!

విద్యా—(పేరిగాఁడు వినకుండ రహస్యముగ) ఏమిచెప్పమనును? రేపు వీని కుత్తిక—కాదా—ఖైదు.

జనా—అయ్యో! పాపము! వాఁడు మన చాకలి.

యుగం—(వానిఁ జాలించి) విద్యానాథా! ప్రశ్న చూచి చెప్పుము

విద్యా—మహారాజు విషయము— శ్రీవారివద్దనుండి శ్రీముఖము రానేవచ్చుచున్నది. రెండువీధుల కావల నున్నది

యుగం—దాని సారాంశమేమో చెప్పుము సూక్ష్మముగ.

విద్యా-

చ. వనమున వేఁటదంతు నెడఁ బాసెను వ్యాఘ్రనఖక్షతంబులం
గనియెను దేహమంతట నఖండముగా క్షయ మయ్యె శోణముల్
పనివడి యొంటిగా విడిసె బ్రాహ్మణమందిరమందు; తమ్ముఁ డేఁ
గొనిచను పొంచు ప్రాసిరిదిగో! చనుదెంచె జనాను లేఖతోఁ.

[భటుఁడు లేఖతో ప్రవేశించును.]

భటు—మహామంత్రిగారికి జయము! శ్రీవారివద్దనుంచి యంచెవాను పరుగున వచ్చుటచే నలసిపడిపోయినాఁడు. ఈశ్రీముఖ మందిచ్చినాఁడు.

యుగం—విశ్వాసరావు! చదువు.

విశ్వా—(చదువును.)

"శ్రీమత్కాకతీయ సామ్రాజ్య ధురంధరులకు జనార్దనామాత్యులకు:—నమస్కారణపూర్వకముగ, ప్రతాపరుద్రమహారాజు వ్రాయునది. వేటగాయములతో బాధనందుచు, సిరిపురమున, బ్రహ్మశ్రీ శ్రీధరశాస్త్రిగారి యింట నున్నాను. రేపు మమ్ము పురిఁజేర్ప వలయును. (ముద్ర) "ప్రతాపరుద్ర మహారాజు."

అందఱు—(విస్మయముతో యుగంధరుని విద్యానాథునిఁ జూచుచున్నారు.)

యుగం—ఏలినవారి వార్త తెలిసినది. కానిప్రాణితులైనందులకు విచారమగుచున్నది

విద్యా—భయములేదు. త్వరలో స్వస్థత నందఁగలరు.

యుగం—జనార్దనా! నీవును విద్యానాథుఁడును చని శ్రీవారిం గొనితెండు. (అందఱితో) మాసోదరులలో నొకఁడగువిద్యానాథుని మాలో నొకమంత్రిగా నిర్ణయించితిమి. ఇందులకు మీకందఱ కనుమతియా?

అందఱు—భాగ్యము.

యుగం—విద్యానాథా! ఇదే నీకధికారపత్రము.

విద్యా—(కన్నుల కద్దుకొని) భాగ్యము

యుగం—శ్రీవారి దేహబాధ కన్నను మనోబాధ యధికమగుచున్నది కొలువు చాలింతము.

అంతఃఉ—అనుజ్ఞ.

యుగం—మంచిది.

(మంత్రులుతప్ప అందఱు నిష్క్రమింతురు)

యుగం—కూర్చుండుఁడు.

చ. భరమగు కార్యభార మది పైఁబడియున్నది; నీతిసాగరో
త్తరణము సేయఁగావలయు; ధాయణి నేతయశంబు నిల్పి; యుం
దఱము ప్రతాపరుద్రమను నాటకమందునఁ బాల్పపాత్రలన్
సురుచిరచాక చక్యమునుఁ జూపివిభుం బురిఁ జేర్పఁగావలెన్.

రూపసాదృశ్యము గల్గినచాకలిపేరిగానికి ప్రతాపరుద్రవేషమును వేసి-విద్యానాథుఁ డీదినము రాత్రి శ్రీకంఠశాస్త్రి మందిరముఁ జేర్ప వలెను. రేపు జనార్దనుఁ డుచితపరివారముతో నరిగి పురిఁజేర్ప వలెను. శ్రీకంఠశాస్త్రుల కిదే దానశాసనము. చాకలిచే నిప్పింప వలెను. (కాగితమునిచ్చి) పేరిగాడు పురిఁచేరినపిదప భావి మంత్రాంగము నెఱిఁగింతును.

విద్యా—మహామంత్రిశేఖరా! (వినయముతో)

క. శ్రీరఘురాముని సేవను,
మారుతి తత్సోదరుఁడుగ మన్నింపఁబడెన్
శ్రీరాజసేవచేత న
నారతముగ సోదరుం డనైతిని మీకున్.

ఆగంతుకునియందుంచిన తమవిశ్వాసమునకు మిగుల లజ్జించుచున్నాను.

యుగం—మహాకవీ!

ఆ. నీతిరచితబుద్ధి- నీతాల్చుకార్యభా
రమ్మునకు నిది ఫలమ్మునుమ్ము
కవిని మించినట్టి కవి నీవు; మాభాగ్య
రూఢి గాదె సోదరుండవైతి.

విద్యా—విశ్వాసమునకుఁ దగు నర్హత సంపాదించుకొందును.

యుగం—మంచిది. (పేరిగాఁడు తొంగిచూచును.)

యుగం—విద్యానాథా! పాప మీపేరిగాఁడు మిగుల భీతి నందియు న్నాఁడు పాని దుస్థ్సాప్తి తప్పింప మార్గమున్నచో చెప్పిరమ్ము. మనకు వీఁడు తరతరములనుండియు చాకలి.

(యుగం, జనా, సిమ్కు నిష్క్రమింతురు)

పేరి—(విద్యానాధుని కాళ్ళపైఁబడి) బాబూ! నాసామే!- నాబెమ్మ దేముఁడా! ఆగండమేంటో- అదేంటో- కయిదేంటో- సెప్పండి బాబూ!!- మీకాళ్ళమొక్కుతా- నాపెళ్ళానికి నేనొక్కణ్ణే నుండి బాబయ్యా!

విద్యా—లేరా-లే-భయపడకు- నీగండము తప్పించెదము. ఇటు రా- ఇక్కడ కూర్చుందము.

(పేరిగాడు సత్వరముగ విద్యానాథునకు పీఠము తెచ్చి వేయును. మరల సత్వరముగ నరిగి విసనకఱ్ఱ తెచ్చి విసరుచుండును.)

విద్యా—పేరిగా! నీయోగము బాగు లేదురా!

పేరి—అదేనుండి బాబయ్యా! అదేనండి- తప్పించండి మారాజా! మీ గులాపోణ్ణి.

విద్యా—రేపు తురకసరదారు నిన్నుచంపివేసి మీయెల్లిని ఢిల్లీకి తీసికొనిపోవును రా.

పేరి—బాబోయ్- నాయనోయ్- అమ్మోయ్- తాతోయ్- నాయెల్లి నే మారాజా! నా యెల్లి నే- నాయెల్లి నెత్తుకెలితే నేను బత కను. బాబోయ్- రచ్చించండి.

విద్యా—కేకలు వేయకు- నీయెల్లిని రహస్యముగా కోటలోనుంచి నిన్ను మాదగ్గఱనుంచుకొని కాపాడెదము. నీయోగము తప్పిం చెదము.

పేరి—బాబయ్యా! బాబయ్యా! మీకాళ్ళకు నాతో లొలిసి సెప్పులు సేయిత్తాను మారాజా!

విద్యా—గండము తప్పినవెంటనే నీకు రాజయోగం పట్టవలసియున్నదిరా!

పేరి—సాకలెదవ కేమిరాసోగం బాబూ!

విద్యా—మామాట తప్పదు. నీవు రేపు రాజగుదువు నిన్ని రాత్రి బంగారపు సవారిలో మోయుదురు.

పేరి—(గడ్డము సవరించుకొనుచు) మాకులపోళ్లె మోత్తారా బాబూ!

విద్యా—ఆ, మీచాకళ్ళె మోయుదురు.

పేరి—(స్వగ) నాసాయిరంగా! ముండాకొడుకుల బుజాల మీదెక్కి వోంబాయి-వోంబాయి- వూరేగుతానా? బాబూ- (ప్రకా) ఐతే మారాజా సెల కడుగుతుండాను. రాసోరాడ్డోళ్ళు నాకాడికి రారుగెందా- ఆళ్ళుజూత్తే నా వొల్లొనుకుతాదండి. సామీ.

విద్యా—రారులే- నీతోనీయెల్లియే సింహాసనముమీద కూర్చుండును కాని యింకొకమాట- నీవు నోరువిప్పి మాటాడితివా యోగముపట్టదు. సరిగదా! ఎల్లిసి తురక యెత్తుకొనిపోవును. నీకు చావు తప్పదు. తెలిసినదా?

పేరి—బాబో- అలాగై తే—

విద్యా—అదిగో మాటలాడుచున్నావా?

పేరి—(నోరు మూసికొనును.)

విద్యా—నామాటతప్పదు- తప్పిన చచ్చెదవు. ఇక్కడనేకూర్చుండుము. సాయంకాలము నీకు యోగ మారంభమగును.

పేరి—(తలయూపి, నమస్కరించును.)

విద్యా—(స్వగ) విషము తలకెక్కినది. వీఁడిఁక బెనకఁడు-పైపనిచూచెదను. (నిష్క్రమించును)

పేరి—నాసామిఁరంగా! నాను రాజునైతే- నాయెల్లి రాని- దొంగనంజ కూతురు- 'మూరాజా' అని పిలమంటే- టక్కు సేసి పేరిగా అన్నది గందా!- యీపాలి పిలకపోతేనా- నాసామీ!-

పాట.

పేరయ్యగా రెల్లి రాజంటా-
పేరెల్లి సరసనా రాణంటా॥ పే॥
పేరయ్య పే రెల్లి పెబువులైపోతేనూ
వూరిసాకల్లంత రాసోరిపట్టాలు॥ పే॥
చాకలోడంటేను సంపేత్తా- రేవు-
మూలెత్తితే డొక్కసింపేత్తా-
పేరెల్లితో పెద్ద సిమ్మాసనంమీద-
కూకుండి సడసాము లాడతా పాడతా॥ పే॥

(గంతులు వేయును.)

(తెరవాలును.)



5 వ రంగము.

[రాజమందిరద్వారమున విద్యానాథ జనార్దనులు కొంచెము దూరమున భటుఁడు కాపు గాయుచుందురు.]

[యువరాజు ఖడ్గపాణియై—ముమ్మడమ్మ, రాణీభవానీదేవి ప్రవేశించుచున్నారు]

యువ—(కోపముతో)

చ. వ్రణముల బాధచేఁ బుఱికివచ్చిన భూపతిఁ దండ్రిగారి సిం
గనుఁగొన మమ్ము నడ్డగొనఁగాఁ దలపోసినవాఁ డెవండు వా

నిని కరవాలధారలను నీల్గఁజేసెద; తల్లి రమ్ము—శా
సన మిటు సేతురే! శమభిష ల్గొని మమ్ము నిరాకరింపఁగన్.

అవ్వగారూ! రండి-అమ్మగారూ! రండి! బాబయ్యగారి దర్శనమునకు మన కాటంక మేల? మార్గమున నడ్డువచ్చినవారిని వాతమూర్చెదను.

(అతిక్రమించి పోఁబోవును.)

సేవ—యువరాజ బాబుగారూ! మంత్రులమాట మన్నింపవలెను.

(కాళ్ళపైఁబడును.)

యువ—(కాలితోఁదన్ని) ఛీ!—దారితొలఁగుము- బాబయ్యగారిని మేముచూడవలెను. ఎవరియాజ్ఞయైన సరియే !

సేవ—(పాదము ముద్దుబెట్టుకొని) బాబూ! వారుగో మంత్రులు వారిసెలవు గొని లోనికి బొండు.

(మువ్వురు మంత్రులను సమీపింతురు.)

భవా—నాయనా! బ్రాహ్మణమంత్రి యడ్డముగా నున్నారు.

యువ—అట్లయిన బ్రాహ్మణులకు భయపడవలసిన పనియే లేదు. ఒక్కనమస్కారము చాలును వారికి!

భవా—నమస్కారముచేత బాబయ్యగారి దర్శనమెట్లగును. నాయనా!

యువ—అమ్మా!

క. ధరణీదేవతలు నమ
స్కారణమునకు నిష్టసిద్ధి గలుగఁగ దీవిం
తురుగద! తన్మిషచే మన
మరుగఁగలము; తండ్రిగారి నాలోకింపన్.

భయము లేదు. రండు- (మంత్రులను డగ్గఱి) మహామంత్రులకు నమస్కారము.

విద్యా } చిరాయువు గల్గుఁగాక! చిరంజీవి బాబూ!
జనా }

యువ—(స్వగ) వీరిదీవన నేననుకొన్నట్లుగా లేదు.

ముమ్మ—సుమతిశేఖరులారా! వ్రతితుఁడగు బాబును మేము సయితము చూడఁగూడదని శాసించితిరా?

జనా—అమ్మా! ప్రభువుగారు ధన్వంతరిల వైద్యమంత్రి ప్రయోగగతుణమునందున్నారు; బాలురకంట స్త్రీలకంటఁ బడఁగూడదు. పడినప్రాణాపాయము ఇది త్రిరాత్రవిధమను. పైనఁ దమచిత్తము

భవా—ఇది వీరికవిత్వము- మాకిది విశ్వాసపాత్రముగా లేదు. భర్తగారిని మేము చూడక మానము.

ముమ్మ—అమ్మా! సాహసముచేయకుము. తమ్ముఁడు యుగంధరుఁడు రానిమ్ము.

యువ—బ్రాహ్మణమంత్రిశేఖరులారా! మీకింత కార్కశ్యముకూడునా?

సీ. కాకతీయాన్వయఘనసార్వభౌములై
గారాబమున మమ్ముఁ గాంచువారి
మహితాటవులనుండి మానద్వయమునుండి
యును మమ్ముఁ గనుఁగొనకున్న వారి
దుష్టశార్దూలసందోహనఖక్షతా
తురులయి స్వాస్థ్యంబు దొలఁగువారి
ఆత్మీయులైన మమ్మరయ మానసమందు
నవిరళసంతాప మందువారి
కష్టసమయమందు, కనులార బాబయ్య
గారి నొక్కమారు గాంచకుండ

మంకు లనుచు భూతమంత్రంబు లనిసేయు
హేతుకల్పనంబు నీతి యగునె?

విద్యా— బాబూ! వేగిరపడకు; తాతయ్యగారు వచ్చుచున్నారు!-

[యుగంధరుఁడు ప్రవేశించును.]

యుగం—(స్వగతము) చిరంజీవి ప్రతాపప్రదర్శనము చేయుచున్నాఁడు. మహారాణియు తాలిమిదూలింది. తమ్ములాపఁజాలరు. (సమీపించును.)

భవా— బాబయ్యా! మాకు దర్శనమున కాజ్ఞ లేదా?

యుగం— నాబిడ్డా! నీకు దర్శనమున కభ్యంతరమా! నే నెప్పించు నప్పుడు దర్శనము చేయుము తల్లీ!

విద్యానాథ జనార్దనులు జూచి వీరు వీరని చూతురు.

విద్యా— / జనా— } (నమస్కరింతురు)

యువ— తాతగారికి నమస్కారము.

యుగం— శతాయుష్మాన్భవ!— నాయనా! స్వతంత్రించి యల్లురపైఁ బ్రతాపము చూపవచ్చునా!

యువ— బాబయ్యగారి దర్శనమునకు మాకుఁగూడ నాటంకములు చెప్పుచున్నారు తాతయ్యా!

ముమ్మ— తమ్ముఁడా! ఏమి యిట్లు జరుగుచున్నది?

యుగం—(జనాంతికముగ) అక్కగారూ!

గీ. స్త్రీలకు రహస్యములు చెవిఁ జేర్పరాదు-
కాని లోకైకజననయిత్రి వైన నీకుఁ
దెలిపెద రహస్యమొకటి; యధీర వగుచు
భావగతశోకమును వెలిబుచ్చ కమ్మ!

క. తురకలు నీసుతు ఢిల్లీ
పురికిం గొని చనిరి పాపపున్ విధి బలిమిన్
భరియింపు మమ్మ! శోకము
పురిఁ జేర్చెద నేను నెలలు పూర్ణము గాకన్.

ముమ్మ—(స్వగ) అబ్బా! నిర్ఘాతపాతమైనది. ఎట్లు ధైర్య మవలంబింపఁ గలను? (జనాంతికముగ) తమ్ముఁడూ! కాలాసన్నురాలను!— నాముప్పు గడుపు భారము నీది!

యుగం—వలదు- వలదు- ఈమాట లిప్పుడు గాదు. మమకారమునఁ బసి-పిల్లల నంతఃపురమునకుఁ గొనిపొండు.

(అనుబంధము 5.)

భవా—ఏమైనది బాబయ్యగారూ!

యుగం—అమ్మా! ఏమగుట కేమున్నది? త్వరలో మహారాజదర్శన మగును లెండు. అత్తగారితో నిప్పటికి లోపలి కరుగుండు- వెళ్లినాయనా చిరంజీవి బాబూ!

(భవానీదేవి, యువరాజు, ముమ్మడమ్మ నిష్క్రమింతురు.)

యుగం—(స్వగతము) ఓరీ! వల్లీఖానుఁడా! నీయంత్యకాలము దాపుర మైనది.

శా. ధీరత్వంబున మేము లేమఁటచు, మాదేశంబునం జొచ్చి- మా
రారాజుం గొనిపోవఁ గల్గు టది మాప్రారబ్ధమే కాక- నీ
శూరత్వంబునఁ గాదు; చూడు మిఁక, నతులిత ప్రతాప ప్రభా
ప్రారంభంబున వీరిఁ గావలయు నా ప్రారబ్ధ నిర్బంధముల్.

సీ. గతులు దప్పని నవగ్రహవిభాకరనిశా
కరతార లట్లెట్టుఁ గదులవలయుఁ
జలన మందని సప్తకులపర్వతములు కుం
భినితోడ నడలి కంపింపవలయుఁ

బరిపూర్ణ ధారుణీవలయ భీషణజల
నిధిసప్తకంబు ఘూర్ణిల్లవలయు
విలయకాలపయోదములు సప్తవాయువు
లొకటి రై చీకాకు నొందవలయుఁ
గాని, సంఘాత మొందఁగాఁ గలదె ? యవన
యోధపరిభవ ఢిల్లీపురాధినాథ
బంధనోగ్రప్రతాపభూపాలలాభ
రాజితగభీరము యుగంధరప్రతిజ్ఞ.

పేరిసెట్టి కోకమూటయు- జనార్దనవిద్యానాథులతో మంతనమును మిగిలియున్నవి. వానిని నెఱవేర్చి—భూమికాధారణము చేసెదఁ గాక ! (అనుబంధము 6.)

(నిష్క్రమించును.)

( తెర వ్రాలును )

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# ప్రతాపరుద్రీయము.

## తృతీయాంకము.

### 1. వ రంగము:

[ఢిల్లీపురవీథిలోఁ- పెద్ద జనసమూహము; వారిలో నొకవెఱ్ఱివాఁడు ప్రవేశము]

వెఱ్ఱి—(వెఱ్ఱి కేకలు వేయుచు)—

పాట.

ఢిల్లీసుల్తాన్- పట్టుకపోతాన్
మూఁడే నెలలాకీ పట్టుకపోతాఁ
* సూరణ్ణి పేరణ్ణి ఖూని చేయిస్తాన్
గుండెల్ బద్దలుచేసి గోరీ కట్టిస్తాన్॥ ఢి॥

(పురవాసుల బాలురు వెనుక అల్లరిచేయుదురు- వెఱ్ఱివాఁడు కొట్టఁ బోవును. వారు చెదరిపోయి తిరిగి చేరుచున్నారు.)

వెఱ్ఱి—వెఱ్ఱిముండాకొడుకు లంతా నన్ను వెఱ్ఱివాఁ డంటారు- ఈ సారి వెఱ్ఱంటే- పిఱ్ఱిత్రోళ్ళెగర గొడతా- నాది రాచపిచ్చి- మద

---

* సూరడు=వల్లీఖాను, పేరడు=ముస్తఫాఖాన్.

పిచ్చికి మందుంది గాని రాచపిచ్చికి రక్షలేదు. (తాఁడు గట్టబడిన తాటాకు వీథిలో నుండఁగా దానినీడ్చుచు) * నాతాటాకూ నాబంగారు తాటాకు- నువ్వు నన్నొదిలిపెట్టి ఢిల్లీలో వున్నావా! రావూ! రా! నిన్ను లాక్కుపోతా- (మరల నింకొక విస్తరాకును చూచి) నావిస్తరాకూ! పుల్లాకూ! పిచ్చిముండా! నిన్నుమాత్రం వొకల్తానా! నిన్నూ దీసుకపోతా—రా నాతల్లీ! (రెంటిని లాగుకొనిపోయి, గిరగిరఁ దిరుగుచు)

"ఢిల్లీసుల్తాన్ పట్టుకాపోతాన్"

(పాడుచున్నాఁడు)

కల్లుదాగిన కోతికి తేలుగుడితే యెక్కుతుందా? పిచ్చిముండాకొడుకిని సైతానుబడితేనూ అంతే—నావొంట తురకసైతాన్ లెందుకూ? యేడవనూ- తురకా మరకా అన్నారు. తురక మరకైతే †చాకలాడి కేస్తేగాని వదలదు. ఢిల్లీ రాకముందు ‡కల్లే తాగేవాణ్ణి. ఇప్పుడు సారా- గంజాయి- నల్లమందు- తెల్లమందూ- నీలిమందూ- పచ్చమందూ-యెఱ్ఱమందూ-అన్నీ సమస్తం- తాగుతున్నా. నేను తురకల్లో గలసిపోతా! సగం గలిసిపోయినాను—యిక సగముంది—తురకమతంలోవుంటే- హిందూమతాన్ని తిట్టాలె—అయితే తిడతా—

పాట.

యేమీామతం మీాది ఛీ-ఛీ-ఛీ !!-
లేకీమతం మీాది తూ-తూ-తూ-

* తాటాకు=ప్రతాపరుద్రుఁడు, పుల్లాకు=ఢిల్లీసుల్తాను. ప్రతాపరుద్రునితో పాటు ఢిల్లీసుల్తానును గొనిపోవుదునని భావము.

† పేరిగాని సూచన.

‡ పూర్వ మొక్క రాజ్యతంత్రనిర్వాహణమే- ఇప్పుడు సకలతంత్రములు నిర్వహింపవలసి వచ్చుచున్నది.

పందీపిల్లా మీకి ఛీఛీఛీ
పందీపిల్లా మీకి ఛూఛూఛూ— 2
గడ్డేకి మొక్తారు ఛీఛీఛీ
బూడ్దెంత పూస్తారు ఛూఛూఛూ— 3
కోతిదైభం మీకి ఛీఛీఛీ
కుక్కదైభం మీకి ఛూఛూఛూ—
గుళ్ళు కట్టిస్తారు ఛీఛీఛీ
రాళ్ళకి మొక్తారు ఛూఛూఛూ— 5

(పాట అకస్మాత్తుగ నిలిపి దృష్టులలో నొకనిని, నిదానించి చూచి) నీ ఉద్దేశం చూస్తే- నేను పిచ్చివాణ్ణనేవుంది- నేను పిచ్చివాణ్ణా! పిచ్చివాణ్ణా! రా- పిచ్చి వొదిలిస్తా.

(వానిని తఱుమును- వాడు పాఱిపోవును.)

వెఱ్ఱి—"ఢిల్లీసుల్తాన్- పట్టుకపోతాన్"

(పాడును.)

వెఱ్ఱి—పందిపిల్లారా! కుంకల్లారా! వెంటబడతారా!!—నన్ను వేధిస్తున్నారా!—మిమ్మల్ని సాధించలేననుకున్నారా!—నేను వీర భోగవసంత రాయడి మేనత్త మేనల్లుడి తండ్రి కొడుక్కు అన్న తమ్ముణ్ణి—నన్నేమనుకున్నారో! నిర్భాగ్యుల్లారా! మిమ్మల్ని సూరడు పంపేడా?—పేరడు పంపేడా?—*ఆవుదూడకు చేత పెయ్యి తయారయింది లెండిరా; ఎగరకండిరా!—నా కొడుకుల్లారా! ఎగిసిపడకండిరా!!—†సూరడికత్తికి పేరడు—వీరడికత్తికి సూరడు—సూరడు పేరడు నన్నెన్నాళ్ళేడిపించారు—వీళ్ల పెళ్లాల తాళ్ళు దెంపుతా—వీళ్ల డొక్కలు చింపుతా—ఈముండ

*ఆవుదూడకు చేత పెయ్యి—పరితాపరుద్రమహారాజుకు చాళలి పేరిగాడు.
†వలీఖానుని, ముస్తఫాఖానుని అన్యోన్యము సంహరించుకొనునట్లు చేయుదును.

మోపులు నన్ను—మురికికాలవల్లో మూఁడుసార్లు ముంచా
రు—పచ్చికరక్కాయలు పదివేలు నమిలించారు—రెండువం
దల వుప్పురొట్టెలు దినిపించారు—(దారినిపోవు నొకనిచూచి)
నీ కుప్పురొట్టె కావాలా? అబ్బీ! ఊఁ! కావాలె అనూ—అన
వూ! అనకుంటే నాలో నేనే అనుకుంటా—ఎందుకురా మీరం
తా నన్నుచూచి నవ్వుతారు? నవ్వితే నే ననను. నవ్విన
వాళ్ళు మంచివాళ్ళా? నవ్వకపోతే నేను వెఱ్ఱివాణ్ణా? ఎవఁడు
నన్ను వెఱ్ఱివాఁడ నేది? దూ-దూ-రాకుక్కా రా! నీకు
కోర్లపున్నమినాఁడు కుడుములు కోడికి వేస్తారా—అంతా యిం
తే—అంతా యింతే—సూరడూ పేరడూ సుద్ధమోసమై
పోయిందాకా—అంతా యింతే—దయ్యాలు నావెంటబడితే
నేను దయ్యాల వెంటబడలేనూ? నేను దయ్యాలకు దయ్యా
న్ని—భూతాలకు భూతాన్ని—పిశాచాలకు పిశాచాన్ని—
మనిషికి మనిషిని—రాతికి రాయిని—రప్పకు రప్పను—చెట్టు
కు చెట్టును—పుట్టకు పుట్టను—కాకికి కాకిని—కేకికి కేకిని—
ఇంకాయింకా—యింకాయింకా—దానికి దాన్ని—దీనికిదీన్ని
—దేనికి దేన్నో నాకే తెలియను.

"ఢిల్లీసుల్తాన్ పట్టుకొంపోతాఁ."

[పహరాజవాన్లు ప్రవేశింతురు.]

1 పహ—అరే భాయ్! ఫజర్ సే ఖానాగీనా కుఛ్ భీనైఖాయా! జా
కైసా రహ్తీరె.

2 ప్రహ—ఏ పక్కాదివానారే!_ హంఝూట్ మూట్-ఇక కాసాత్
ఘుమ్నే కాజరూరత్ నహీహై—హారాంసే ఘర్ మే సోజావుం
గా అవ్—

1 పహ—దివానాఖబర్ స్తాఁ షైజాకర్—రాత్మే ఖానాపకానేగా హై

సంస్తాహుం—వోబీ దేఖ్ కర్—జావుంగా సబర్ కరో—

(ఇరువురు నిష్క్రమింతురు)

వెఱ్ఱి—కొండన్న కొండమీదావుండడు- ఎఱ్ఱన్న యెఱ్ఱగానూ వుండడు-*పిచ్చన్నకు పిచ్చివుండదు. ఏనుగ లెగిరిపోతూంటే పుల్లాకా సీగతేమన్నారట! నాది జ్ఞానపిచ్చంటే నమ్మే చచ్చువెధవ వొక్కడూ లేడు—

"నమ్మిచెడిన వారూ లేరూ!
నమ్మక చెడిపోతే పొయ్యేరూ."

పిల్లిపిసరకాయలు దింటే పిల్లికిజ్వర మొచ్చింది—ఏనుగలు మింగేవాడికి పీనుగలు ఫలాహారమూ! పిల్లికి పిసైనా వెయ్యని పీనుగరాయిళ్లు—

ఒకపురవాసి—(స్వగ) పాప మాకలియగుచున్నదో యేమో- వెఱ్ఱి ముండాకొడుకు. కొంచెం అన్నంపెడితే తింటాడేమో—(అన్నపు విస్తరి తెచ్చిపెట్టి) అబ్బీ! ఇంద! తిను.

వెఱ్ఱి—నాతండ్రే! నా బాబే!! నానాయినే! నాకన్నంబెట్టావా నాయనా—నా కన్నంబెట్టావా! నీకొడుకుల్లేకుంటే కొడుకులూ- పిల్లల్లేకుంటే పిల్లలూ—కుక్కల్లేకుంటే కుక్కలూ—రాళ్ళు లేకుంటే రాళ్ళూ—పుడతాయిలే నా బుల్లీ!!

(కుక్కను పిలిచి) దూ—దూ—తమ్ముడూ—దా—ఇదుగో—అప్పచ్చి—అప్పచ్చి—పెసరపుణుకులు—సోడిగా రెలు—తిను నాయనా తిను!—వంశానికి నువ్వొక్కడివి మిగిలావు—చస్తే యేలాబతుకుతావో—(కుక్కతినుచుండగా) పాతమ్ముడూ! సూరడూ శేరడూ నీ కన్నంలో సున్నం పెట్టారా!—నాబాబూ! ఏడవకురా! నువ్వేడిస్తే నేనూ ఏడుస్తా. (కొంతసే

---

*నేను పిచ్చివాడను కానని భావము.

పేడ్పి అకస్మాత్తుగా కుక్కను కొట్టి) వెళ్లు—వెధవకుక్కా! ఇంకా విస్తరి కూడా నమిలేద్దామనుందా నీకు. చెఱుకు తీపని వేళ్ళతో నముల్తావా! —వెళ్ళు—వెళ్ళు— (చావఁగొట్టుచున్నాఁడు. కుక్క మొఱుగుచు పోవుచున్నది.)

ఆహారుఁడు—వట్టి వెఱ్ఱిముండాకొడుకు. (నిష్క్రమించును.)

వెఱ్ఱి— "ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
మూడేనెల్లకి పట్టుకపోతాన్
సూరణ్ణి పేరణ్ణి ఖూనీచేయిస్తాన్
గుండెల్ బద్దల్ చేసి గోరీకట్టిస్తాన్."

(చూచుచున్నవారిలో నొకఁడు తనవెంటనున్న యిద్దఱితో)

ప్రథ—వరే! వీఁడిది వట్టిపిచ్చిగాదురా, జ్ఞానపిచ్చి! అష్టసిద్ధులు బొందిన అయ్యవారులా గున్నాఁడు. మనము మెల్లగా ఆశ్రయిస్తే— బంగారం చేసే యోగాలు చెపుతాడు. కొట్టినా తిట్టినా వదలకుండా వుండి నేర్చుకుందాం—రండిరా—

(ముగ్గురు సమీపింతురు)

వెఱ్ఱి—నేను జ్ఞానతత్వాలు పాడుకుంటా- సమస్తమైన యోగాలూ నా కరచేతిలో అరటిపండ్లు.

పాట.

దీనిభావము తెల్పియవలెనండీ।
జనులార మీరూ। మర్మములో పల గలియవలెనండీ॥

1. దీనిభావము తెలుసుకుంటే। †తేనదెచ్చి దాచుకుంటే
*తేనటీగెలు ముసురుతూంటే। తైతక్కలాడుతూంటే॥ దీని॥

†తేన—ప్రతాపరుద్రుఁడు.
*తేనటీగలు—యుగంధరాదులు.

*మింటిలోని చెంద్రవంక కంటిలోన గానుపించె
కన్నుబొడిచి కడలిగడపె । చెంద్రబింబము నమకోంకి॥ దీ॥
‡ కోటిజెట్టుకు వేలువాచి । రోటిలావున గానబడితే
వింతగానూ రోటివాచి । యొంతలావున గానబడునో॥ దీ॥
† అర్ధరాత్రి గుడ్లగూబ । అడవికాకుల బొడిచిచంపితె
పట్టపగలే కాకిమూకలు । గుడ్ల గూబల గుడ్లుదీయవె॥ దీ॥

"ఢిల్లీసుల్తాన్ పట్టుకొపోతాన్
మూడేనెలలాకి పట్టుకొపోతాన్
సూణ్ణి ... ... ... ... ... ... "

రండి—రండి—వేదాంతం నేర్చుకునే వెఱ్ఱిముండాకొడుకులంతా నాదెగ్గరికి రండి- గజకర్ణ- గోకర్ణ - టక్కుటమూరమళయాళమంత్రాలు నేర్పుతా—అగ్ని స్తంభన, వాయుస్తంభన, జలస్తంభన, ధ్వజస్థంభన, వీర్యస్తంభన, విద్యలన్నీ నేర్పుతా—

"ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్"

శ్రీధ—మహాప్రభూ! మేము మీ శిష్యులమౌతాం- మాకావిద్యలన్నీ నేర్పండి.

వెఱ్ఱి—సెబాసు- సెబాసురా- బాగుపడేవాళ్ళంటే మీరు- తక్కిన వాళ్ళంతా వినాశకాల మొచ్చి తుడిచిపెట్టుకొపొయ్యేవాళ్ళే. మీరు రండి మీకు నేర్పుతా- ఇదుగో మీచదువుకు విఘ్న

---

* ఓరుగంటిలోని ప్రతాపరుద్రుఁడు ఢిల్లీలో చెఱయందున్నాఁడు. చెఱ బ్రద్దలుచేసి సముద్రము దాటించవలెనని భావము.

‡ వినాశకాలమువచ్చిన వలీఖానుఁడే యింతమాయచేస్తే యుగంధరుఁ డెంతమాయచేయ లేఁడు?

† మోసగించి వల్లీఖాను ప్రతాపరుద్రుని బట్టగా- యుగంధరుఁడు బహిరంగముగా ఢిల్లీ సుల్తానును పట్టునని భావము.

శ్వర పూజ- శ్రీ- చుక్క- దెబ్బ- ఒకటి- రెండు- మూఁడు-

(ముగ్గురిని మూఁడు దెబ్బలు కొట్టును)

చూపరులలో ఒకఁడు—బలే! చమువు మొదటే వొంటబట్టిందిరా బాబూ!

వెట్టి—వెట్టిముండా! వెధవముండా! చేతగాని రండా! నల్లజండా! నీకెందుకురా నా జోలి? నీ కెందుకురా నా జోలి?

(వాని వెంటఁబడును. వాడు పాఱిపోవును.)

1 శిష్యు—కొడితే కొట్టారు రండిరా! వేదాంతం నేర్చుకుందాం.

2 శిష్యు—మాకు వేదాంతం చెప్పండిగురూ!

వెట్టి—ఈ మూఁడో వెధవ నోరువిప్పడేం?

(చెవి పట్టుకొనును)

3 శిష్యు—చెప్పండి గురూజీ! వేదాంతం చెప్పండి- నేర్చుకుంటాం.

వెట్టి—(చెవి వదలి) అట్లా దారికిరా- సప్తకట్ల సన్నాసి—నాపాట చెపుకోండి-

(ఒక్కొక చరణమే వెట్టివాఁడు చెప్పఁగా శిష్యులు పాడుచుందురు.)

పాట.

మూణ్ణాళ్ళబ్రిదుకునకు మనిసేవు తుళ్ళేవు ముందుగతిగానవే చిలుకా॥
కట్టెలే చుట్టాలు కర్రిలేబంధువులు కన్నతల్లెవ్వరే చిలుకా॥
చావనప్పుడునీకు జంజాటమేగాని వెంటనెవరూ రారు చిలుకా॥
నిన్ను- మోసేను నలుగురూ వెంబడిని వదిమంది కాష్టాలదిబ్బకే చి॥
ఊరికి వుత్తరాన సామాధిపురములో కట్టియిల్లున్నదే చిలుకా॥
కూడబెట్టినసొమ్ము గొప్పగా నీమీద తగలవేయరు రామ చిలుకా॥

పూర్వం వీరబ్రహ్మంగారి మఠంలో చేరినప్పుడు- మూఁడేళ్ళు శిశ్రూషచేసి దీన్ని నేర్చుకున్నా- మూఁడునిమిషాల శిశ్రూష లేకుండా మీకు సెప్పేశాను- ఇంకా బంగారంచేస్తే, పరమ

హంసక్రియలు నాదగ్గఱెన్నో వున్నాయి- దానికి జ్ఞానపత్రిగా వాలె (గంజాయి పీల్చినట్లభినయించి) జయ్ శీతారాం శివా బసవేశ్వరా! ఊఁ ఇదా! కాల్చండి 1 తలావొకపట్టూపట్టండి-
(పట్టిచేయి చిలుముపట్టుగాపట్టి యిచ్చును.)

శిష్యు—పట్టిచేయి ఏమికాల్చాం గురూజీ!-

వెఱ్ఱి—పట్టిచెయ్యటా? మట్టిచేశ వెధవా! పట్టిచెయ్యటా?-(కొట్టుచు)నీకు వేదాంతం పట్టుబడలేదు. తెలియనివారికి విషముష్టిపండు- తెలిసినవారికి తియ్యమామిడిపండు. ఇదే వేదాంతానికి కథ పట్టు- దీనిట్లో చూస్తే-ఏంగనపడుతుంది? అందులోనే అన్నీ వున్నవి. మెల్లకంటివాడికి కిద్దఱు సూర్యుళ్ళు కనబడుతారు- భూమివుందా- ఆకాశంముందా? విత్తుముందా- చెట్టుముందా? అడ్డబొట్టుముందా—నిలువుబొట్టుముందా? సుత్తెముందా కారుముందా? ఈవేదాంతమంతా నికెప్పుడు తెలుస్తుంది వెధవా! ఇది కాలిస్తే అన్నీ బట్టబయలు- వేదాంతాన్నంతట నీ పీరబ్రహ్మాంగారు చిలుంగొట్టంలో కూరేశారు. ఊఁ! కాలుస్తావా? కాల్చవా? (కొట్టఁబోవును)

1 శిష్యు—బాబూ! కాలుస్తా.

(తాను కాల్చి తెక్కినయిద్దఱికిచ్చును. వారు కాల్తురు)

వెఱ్ఱి—(లేచి ఎగురుచు) వారేయ్! వారేగ్!! సాంఖ్యంరోయి- సాంఖ్యశాస్త్రంరోయి-నేను సాంఖ్యశాస్త్రం నేర్చుకున్నా- మీకు చెపుతా నేర్చుకోండి—

తుమ్మచెట్టుమీద గద్దవాలిందీ
తుపాకితేగా కొడదామూ
అతనీ తమ్ముఁడూ ఆపినా గాయనా
తప్పకుండ లెక్కబెడితే ముప్పయ్యొక్కటి.

లెక్క బెట్టరేం- గాడిదల్లారా—

(మరల చదివి లెక్క పెట్టించును.)

శిష్యు—(మహాకష్టముతో నమమ నమమ తప్పుచు దెబ్బలుతినుచు లెక్క పెట్టుచున్నారు.)

1 శిష్యు—ఇక్కడికి వేదాంతం చాలు గురూజీ! తమరు శృంగార మేమన్నా తెలుసునా?

వెట్టి—ఓ! శృంగారంలో నేను పెట్టింది పేరు—శ్రీనాథుణ్ణి చంపిపుట్టినవాణ్ణి—

2 శిష్యు—తమకు శృంగారపు పాటలేమైనా వొస్తే చెప్పండిస్వామీ!

వెట్టి—అట్లా అయితే చెప్పుకోండి! నాశిష్యులు నాఅంతవాళ్ళయినారంటే నాకు బ్రహ్మానందం

చూపరులలో ఒకడు—ఆఁ! వెధవముండకి దణ్ణంబెడితే నాలాగే వర్ధిల్లమన్నదట!

వెట్టి—ఆవెధవముండమాట మీకెందుకు చెప్పుకోండిరా మీరు—

(వెట్టివాడు చెప్పుచుండును. శిష్యులు చరణచరణము పాడుచుందురు)

వెట్టి— పాట.

సీలాటిరేవులో కోలాట మాడ్యాంగ
సిన్నవరుపిలిచారే? - రంగీ - సిన్నవరు బిలిచినారే ॥

శిష్యు—సీలాటి......................సిన్నవరు.........

వెట్టి—తురకసాయెబు నిన్ను అగ్గినిప్పడిగితే
అగ్గిబుగ్గైనావటే - రంగీ - అగ్గిబుగ్గైనావటే

శిష్యు—తురక....................అగ్గిబుగ్గై...............

వెట్టి—పంచపాళిలోన పరమాన్నమొండి నీ
మిండడికి బెట్టావటే - రంగీ - మిండడికి బెట్టావటే

శిష్య—పంచపాళీ..................బొండడికి............

వెఱ్ఱి—చింతచీరాగట్టి సాతపాకలకాడ
సీసీటు జూపావతే - రంగీ - సీసీటు జూపావతే

శిష్య—చింతచీరా..................సీసీటు............

వెఱ్ఱి—వొంటెద్దుబండెక్కి బాడ్లోడిసోగ్ నువ్వు
సడసాలు సాగిస్తివే - రంగీ - సడసాలు సాగిస్తివే

శిష్య—వొంటెద్దు..................సడసాలు............

శిష్య—గురూజీ! మీ రింత శృంగారపురుషులు గదా—పెళ్లాడరేమి స్వామీ !!

వెఱ్ఱి—ఇన్నేళ్ళుండా కోసుకుంటే ఇరవైయుండిరి పెళ్లాడుమను నేను మనిషినిగానా-పెళ్లాడతేనా? నాకేంతక్కువుంది-(చంకలు గొట్టుచు) పెళ్లోయి—పెళ్లోయి—ఆడవాళ్లోయి—ఆడవాళ్లోయి-పెళ్లాడతానోయి—పెళ్లాడతానోయి—నాపెళ్ళి! సన్నాయి మేళాలివిగో! కీ-కీ-కీ-కీ-కీ-కీ-కీ—నాపెళ్ళికి తాషామర్పాలివిగో! డాండాండాండాండాండా—(పిఱ్ఱలమీద కొట్టుకొనుచున్నాడు. దర్శకులను జూచి) నాపెళ్ళంటే మీకు, కళ్ళు కుడుతున్నాయా? వొళ్ళు మండుతూందా? మీరుకూడా-సూడడింకో-పేడడింకో గలిశారా?- ఉండండి- ఉండండి —మిమ్మల్లందర్నీ వొక్కసారే పురంబెడతా.

'ఢిల్లీసుల్తాన్ కట్టుక పోతాన్
మూండేనల్లాంకి కట్టుక పోతాన్ ॥"

(ఖుస్రూ మార్గమున నడుచుచు వెఱ్ఱివాని తేరిచూచుచున్నాడు.)

1 భటు—(రెండవవానితో) అరే! భాయ్! ఖుస్రూఖాన్ సాహెబ్ రే! తెలంగీములుక్సే ఆయా!. వల్లీఖాన్ బహదూర్ కా ఘర్కా జాతాహై.

(ఇద్దఱుభటులు ఖుస్రూకు సలాములుచేయుదురు. ఖుస్రూ సలాములందుకొని నిష్క్రమించును.)

వెట్టి—(స్వగతము) ఖుస్రూవచ్చినాఁడు. అనుకొన్నట్లు జరుగునేమో-తెలిసికొనవలయును. (ప్రకాశముగ) ఈమూఁడో వెధవ నా మాట వినటంలేదు. నన్ను వెట్టిముండాకొడుకననే అనుకుంటున్నాఁడు. వరే-నేను వెట్టివాణ్ణి కానురా! నీకు మంచియోగం చెపుతా దగ్గఱికి రా!

3 శిష్య—(భయపడును)

1 శిష్య—వెళ్ళరా! గొప్పసిద్ధుఁడు- యోగం చెపుతాఁడు.

శిష్య—(దగ్గఱికి పోవును.)

వెట్టి—(చెవిలో రహస్యముగ చెవి గఱచి) నీకిదే యోగం- వెళ్ళు వెధవా! నాశిష్యుల్లో పనికిరావు.

3 శిష్య—(ఏడ్చుచు) వెట్టిముండాకొడుకు చెవి కొఱికేశాడ్రో బాబో!!- నేనిక్కడుండను. (నిష్క్రమించును.)

వెట్టి—ముసలమ్మపేష- మంచంకోగ్గూడా- మీరు రండిరా! మీకు పాట చెపుతా—

1 శిష్య—, 2 శిష్య— } చెప్పండి స్వామీ-వాఁడు కొంటెవెధవ.

వెట్టి— పాట

అక్కడుంటే నేమిరా మన ఇక్కడుంటే నేమిరా
వూరికే రెణ్ణాళ్ళ పాటూ ! వుండి పొయ్యేటందుకూ॥

శిష్య—అక్కడుంటే..............వుండిపొయ్యే.........

వెట్టి—అన్నమైతే నేమిరా మరి సున్నమైతే నేమిరా
అంకుచేత పాడుపొట్టకు అన్నమే వేతాము రా॥

—అన్నమైతే....................అన్నమే.........

వెట్టి—మేడలైతేనేమిరా కడవాడలైతేనేమిరా
అందుచేత పాడుబొందిని మేడనే వేతాకురా॥

శిష్యు—మేడలైతే..................మేడనే..........

వెట్టి—విందులైతేనేమిరా మరి నుగ్గులైతేనేమిరా
అందుచేత జీననాశికి విందులేచేతామురా॥

శిష్యు—విందులైతే..................విందులే.........

వెట్టి—బెల్లమైతేనేమిరా మరి అల్లమైతేనేమిరా
అందుచేత తియ్యచెఱుకు బెల్లమే తిందాముర॥

శిష్యు—బెల్లమైతే....................బెల్లమే.........

వెట్టి—నేను వొకచోట- వొకప్పుడు వొకరు- ఆసుకవిచక్రవర్తులని బిరుదు తగిల్చారు- నా ఆసుకవిత్వం చెప్తా చెప్పుకోండి—

ఉ. పంబినపంబపంబపబపంబపబంబబపంబపంబపం
బంబబబంబబంబబబబంబబబంబబబంబబంబ

1 శిష్యు—స్వామీ! ఇది సాంతమవడ మెప్పటికి?

వెట్టి—మనం బ్రతికుండగా యిది సాంతం గాదు. ఇది అనంతం- మన మంతమైతే యిది సాంతం.

3 శిష్యు—(మొదటివానితో) వరే! ఇక్కడిక మనముంటే సాంతంకావడమే- మెల్లగా వెళ్లుదాం పద! వీడిదెగ్గఱ యోగాలూ లేవూ- వల్లకాళ్లూ లేవు.

1 శిష్యు—మేమిక వెళతాం గురూజీ!

వెట్టి—వెళతారూ! వెళతారూ! ఎక్కడికి వెళతారో వెళ్ళండి.
(చావఁగొట్టును.)

(శిష్యులు చచ్చినట్లు పడియుందురు.)

వెట్టి — చచ్చారోయి - నాయనో - చచ్చారోయి - బాపనోళ్లు చస్తే బాపన పిశాచాలు పడతాయి - వీళ్ళకు మంత్రంవేసి బతికిస్తా - (మన్ను ప్రోగుచేయుచుండఁగా శిష్యులు పాఱిపోవుచున్నారు.)

వెట్టి — పిశాచాలు పరిగెడుతున్నాయి - వీళ్ళు దయ్యాలైతే నేను భేతాళుణ్ణి - బాపనిదెయ్యాలు భేతాళుణ్ణి పట్టవు - తురకలమీదికి ధూ - మంత్రం - ఘా మంత్రం - (ఉచ్చాటనచేసి) మేము యెండలో యెండనూలేదు - నీడను నిలఁగనులేదు, అగ్గిని కాలనూ లేదు - నీటను నాననూలేదు, గాలికి కదలనూలేదు - భూమిని పూడనూ లేదు, కత్తికి కందనూ లేదు - సుత్తికి సురగనూలేదు, అంపల మొక్కనూ లేదు - కిందికి దూకనూలేదు, చావనూలేదు - బతకనూలేదు, నాపాట నేం బాడుకుంటా - నా ఆట నే నాడుకుంటా —

"ఢిల్లీసుల్తాన్ కట్టుకపోతాన్"

[చెకుముకిశాస్త్రి ప్రవేశించును]

చెకు — (స్వగతము) ఈపహరాజవాను లిదివఱకు నాకొలువునందు కొన్నాళ్ళుండినవారు - గుర్తింతురేమో - ఐననేమి? తరువాత వృత్తాంతము నీపంద తెలియఁగరు - నేనే పలుకరించెద! (జవానులతో) ఏమిరోయి - వెట్టివాని వెంట తిరుగుచున్నారు?

జవా — (సలాముచేసి) మహారాజ్! చాలారోజుల్కి దర్శనం - మేం, రాత్ దిన్, ఈదివానాతో మచ్చిపోతూవుండాం. ఈను దివానా వెల్వటం లేదు - దొంగ తెల్వటంలేదు.

చెకు — వీనిని దొంగలనకొన్నవాళ్ళు వెట్టివాళ్ళు వీఁడు పట్టిదివానా, కనఁబడుట లేదటరా! సుఖముగా భార్యలతో పండుకొనక మీ కీగ్రహచార మేమి?

2 జవా—మహారాజ్! సుల్తాన్కీ హుకుం కదా!

చెకు—సరే! మీఖర్మము- నేనేమిచేయుగలను-(వెట్టివానిని జూచి) దివానాగారూ! నమస్కారము.

వెట్టి—నువ్వుకూడా వేదాంతం నేర్చుకుంటానని సైతానువై పారిపో వడానికొచ్చావా! వెధవా! నాదగ్గఱెందుకు వెళ్ళు.

చెకు—వేదాంతంగూడా మీ కనుగ్రహమువచ్చిన నేర్చుకొనును. ఒం టిరాతిమీఁచి పైకెక్కాను. మీ నాజ్ఞ-కావాలిసొస్తే దయ్యాన్ని కూడా కాగలను. (అందఱు వినుచట్లు స్వగతము) ఇక విశేష ముగా మాటలాడితే చంపివేస్తాడేమో వెట్టిముండకొడుకు- వెళ్ళెదను. (నిష్క్రమించును.)

వెట్టి—(స్వగతము) ఒంటిరాయి అనఁగా ఓరుగల్లు గాదా! మీఁవాఁడ ననుచున్నాఁడు. ఇతని సంగతి యేమో యనుమానమే! తెలిసి కొనవలెను- అయిుటుఁ దూరినాఁడు. కానిమ్ము. చీఁకటిపడుచు న్నది. ఈభటులకంట దుమ్ముగొట్టి యితని యీగడ నెఱింగెద. (ప్రకాశముగా) న కొకళ్ళతో పనేమిటి! ఈ అరుగుమీద పడుకుంటా! (ఒక సత్రపుఅరుగుమీద కూర్చుండి- నట్టిచేతు లతో తాడుపేసిన ట్లభినయించును) దయ్యాల్ని దీనితో ఛెర్చ ఛెళ్ళున బాది వెళ్ళగొడతా

(భటులు రెండవ అరుగుమీఁద పరుందురు.)

1 భటు—అరే! మఃకీ యీరోజ్ ఘుంఘాయ్కూడా లేదురా! ఈసిక్క యిడ్సివెల్లటాన్కి హుకుం లేదూ—

2 భటు—నాకీకూడా ఫాణాం ఘుటోక్ ఘుటోక్ అంటుంది రా—

వెట్టి—(స్వగతము) మంచిసాధనము! నావద్దనున్న మత్తుమందు కలి సిన గంజాయిని వీరికిచ్చెదను. దీనితో వీరికీ రాత్రియంతయు

నిద్ర- కార్యసాధనమగు మార్గము (ప్రకాశముగ) తురకదయ్యాలు గంజాయి పీలుస్తరూ! నన్నడిగితే యివ్వనూ!

1 భటు—(పరిహాసముగ) ఇప్పించావోయి ఏవాహా సర్కార్ !

వెట్టి—ఇందు- ఇంద- ఒకడికి సూతికాభరణం- ఒకడికి వాతరాక్షసం..
(ఇచ్చును)

2 భటు—అరే! నిజంగా యిచ్చినాడ్. ఇది మన నసీబ్.

1 భటు—సన్యాసుల్ యోగుల్ ఘుంజాయ్ పీలుస్తారా తెల్వదురా.

(భటులు గంజాయి పీల్చి క్రమముగ భూమిపై నొరుగుదురు.)

(వెట్టివాడు చల్లగ బయలుదేరి నిష్క్రమించును.)

2 వ రంగము

[ప్రవేశము:—ఒకగృహమున శయ్యపై చెలువుండును; ప్రక్కన శ్యామలయు.]

చెలు—శ్యామలా! లోకమున సామాన్యముగ వెలకాంతలు—

సీ. మగవాని యనురాగము గని పంగుబోక,
పయి బేరముల కయి పాకులాడు
ధన మొసగుచున్నఁ దనియక, నేదియో
విసవక నెప్పుడు కొసరుచుండు
కల్ల ప్రేమంబు మొగంబున నటియించి
గోడచాటైన వింతొకనిఁ జూచు
ఆస్తియంతయు జేరఁ జాగుదాక పీల్చి
పిప్పి యైనఁ బెడవి చప్పరించు
ధనము చెల్లినంతఁ దనతల్లి నసికొల్పి,
పరువు దీసి నెట్టి బయట కీడ్చు—

కాని, సన్న్యాసులు గణిక లోకంబున
నొసర వేయి కొకతె యుండు టరిది.

శ్యామ—మనోరమణా! అదేమిమాట— వేశ్యాకులమంతయు వివేక
రహితమేనా? సాధ్వులవలె వన్నెకెక్కిన వేశ్యలు మున్నందఱు లేరు

ఆ. సాధ్వి మీఱునట్లు చరియించదే మున్న
చారుదత్తునకు వసంతసేన—
శీలవతిగ లేదె చింతామణియు బిల్వ
మంగళుని వివేకసహితుఁ జేసి.

చెకు—నిర్వు నయితము వారితో సమాన మగుకీర్తిఁ గాంతువనుటకు సంశయము లేదు. నేను చేరదీసిననాటనుండియు నీచరిత్రము స్తోత్రపాత్రముగనే యున్నది. అందులకే యీమహారాజ్యతంత్రము నయితము నీచెవిని వైచి నిన్నందుకసాధనముగఁ జేసికొనుచున్నాను.

[వెట్టివాఁడు గుమ్మముబయట ప్రవేశించు.]

వెట్టి—(స్వగ) ఏమనుకొంటాను. పిల్చిన విధవలు— తెల్లవాఁడనుక దీర్ఘ పిడ్రి నందును నందురు గాక!— ఈమహాత్ముని వృత్తాంతమేమో యీలోపల తెలిసికొంటును.

(చీకటిలో నరుగుమీఁద పండుకొనును.)

చెకు—శ్యామలా! వేశ్యవైనను నీపై నధికారముఁబూని నిన్నిపుడు ధర్మశాస్త్రశేషమునఁ బ్రవృత్తురాలినిగాఁ జేయనున్నాఁడను. తురకలవలనఁ బరభవింపఁబడి, మ్లేచ్ఛసంహారసముద్యోగంబున, నాంధ్రసార్వభౌముని సహాయము నందఁదలఁచి, యోరుగంటి కరుగునప్పటికి—రాజును, యుగంధరుఁడును పురమున

లేరైరి. జనార్దనమంత్రి నేను శత్రుపక్షమునందలివాఁడ నని
యనుమానించి విశ్వసింపఁడయ్యె.

శ్యామ—అప్పుడు మీ రేమిచేసితిరి ?

చెకు—మహాకవి యగువిద్యానాథు వారి యుపదేశమున—తురక
లకు జోస్యముచెప్పి నమ్మించి, వల్లీఖానుప్రభృతిసుదాశ్వము
లకు కళ్ళెములు వేసితిని. తురకలు ప్రతాపరుద్రమహారాజును
ఖైదు చేసిరనువార్త నెఱింగి—రాజును చెఱవిడిపించు ప్రయ
త్నమున నాశక్తి యేమైన వినియోగపడు నేమో యనియు—
ఖుస్రూ, వలీ, ముస్తఫాఫిరోజులను నాశనముచేసి- సుల్తా
నును పరాభవింపవలయుననియు—దైవానుగ్రహమున,
మహారాజు విడుదలయైనచో- మ్లేచ్ఛవినాశము నొనరింపఁ
జేయవలయుననియు సంకల్పించితిని.

శ్యామ—తురకలు మహారాజును చెఱనిడిరని కొందఱును- చాకలిని
మహారాజుగా భ్రమించి, వల్లీఖాను బాధించెనని కొందఱును
చెప్పకొనుచున్నారు. ఇం దేది నిజము?

చెకు—మిగుల రహస్యమగువిషయము! మహారాజునే తురకలు గొని
వచ్చిరి. చాకలివాఁడుప్రవాదము రాజమంత్రుల మేధాఫలితము.

శ్యామ—(ఆశ్చర్యముతో) ఎంతచిత్రము! తమ కిది యెట్లు తెలిసెను?

చెకు—మహాకవి యనుగ్రహమున—

వెఱ్ఱి—(స్వగ) విద్యానాథుఁడు రహస్యప్రచురణము చేయునా? కాదు-
కాదు- ఈమహాత్ముఁ డందులకు పాత్రుఁడు- కాని- విచారింతము.

శ్యామ—మహామంత్రి యుగంధరులవారు రామేశ్వరమున మరణించి
రని వదంతిగా నున్నదేమి?

చెకు—వెఱ్ఱిదానా! అది నేను- వల్లీఖానునకు చెప్పిన జోస్యమునకు
ఫలము.

వెట్టి—(స్వగ) బాగు. కుమారా! బాగు. ఈవదంతి వేసిన బుద్ధిమంతుఁడవు నీవని మే మెఱుంగ లేకపోయితిమి. నీయుపకారమునకు బుద్ధివిశేషమునకు భవిష్యమున సత్ఫలముఁ గాంతువు గాక!

శ్యామ—అట్లయిన యుగంధరులవా రెందున్నవారు?

చెకు—"ఇందుఁ గలఁ డందు లేఁ డనుసందేహము వలదు" సర్వత్రి-ఢిల్లీనగరమున భగవంతునివలె నిండిపోయినాఁడు.

వెట్టి—(స్వగ) మమ్ము గుఱుతింపఁదగిన బుద్ధివిశేషము గని యానందించితి.

చెకు—

సీ. పునుక లస్తులు పెంటపులివిస్తరాకులు
రాలు రప్పలును హారములు గాఁగఁ
దగల వేసినఁగాని దహియింపఁబడకఁ, కం
పోలయుఁ గొంగడిబొంత వలువ గాఁగఁ
జల్లరజనములు, పిల్లకాయలు, గను
గ్గాయలే భక్తవర్గములు గాఁగ
"ఢిల్లీసుల్తానుఁ బట్టెద!" నన్నవాక్యర
త్నంబె పునశ్చరణంబు గాఁగ
నఖిలదిశలఁ బిశాచాట్టహాసములను
భీకరంబుగ నింపుచు- విశ్వనాథు
లీల సీరంధ్రిగతుల ఢిల్లీపురమున
మహితుఁ డయ్యె యుగంధరామాత్యవరుఁడు.

శ్యామ—ఏమి! మూఁడు నెలలనుండియు వీధులలోఁ దిరుగుచు ఢిల్లీసుల్తానును బట్టుకొనిపోవుదు ననీ, కేకలు వేయు వెట్టివాఁడా యుగంధరుఁడు?

చెకు—ఏ తటిని మహాత్ముఁ డెట్టి హేయాకృతిం దాల్చి ప్రభుప్రకాశను కష్టపడుచున్నవాఁడో పరికింపుము.

సీ. వెత నందుచున్నాఁడు సతతసదాచార
  ఘనద్విజుఁడు మాలపల్లెలోన
నున్నాఁ డను పేరునున్నాఁడు లోకముల్
  దలఁకింపఁ జేయు మేధాసుధాబ్ధి
కట్టుచున్నాఁడు గోఁగడి పాతనైన, నే
  దీనతఁ గనని యదృష్టశాలి
భరియించుచున్నాఁడు పౌరులబాధ, శో
  షించి భూప్రజం బాసించుమంత్రి
నిలువ నీడ లేకఁ గుడువఁ గూడును లేక
కాయమునకు నే సుఖంబు లేక
ప్రతినఁ బూని రాజభక్తిఁ జరించు యు
గంధరుండు నీతిబంధురుండు.

విట్ఠి—(స్వగ) ప్రకృతిసుకుమారుఁ డగు నంతటిమహాప్రభువు చెఱసాలయం దమితకష్టంబు ననుభవించుచుండఁగా— చెకుముకీ!— నాకష్టంబులకు వాపోయెదవు; నీ కేమి విట్ఠీ?

చెకు—సంవత్సరకాలము నేను నీవంకఁ జూచినందులకు, నీతల్లిముండ కాగ్రహము గల్గెనుగదా! నిన్ను పంపుటకు సులభముగ నియ్యకొనెనా?

శ్యామ—తమకు ఢిల్లీసుల్తానుకడ దివాను పనియైన దను లేఖ తమవద్ద నుండీ యుండఁగనే మహానందపరంపర యైనది.

చెకు—నీప్రయత్నము పాపమానందించి యుందును కాని— నాపరాధ నముల నిటుంగింపు. పైగా నీకిప్పుడు నేను బీబీవేష మొకటి తగిల్చి

చెకు—ఇంతటి సాహసవాక్యమున కిప్పటినుండియే మెచ్చు ప్రారంభము!—(మద్దికకొని) రమ్ము—పొద్దువేళ యైనది.

(ఇరువురు నిష్క్రమింతురు.)

వెట్టి—(లేచి, స్వగ) ఇప్పటి కీతని స్వరూపము తెలియఁబడినది. ఇట్టి రత్నము నాజనార్దనుఁడు చేఁజార్చినాఁడు!—ఈ సహాయమే యున్నచో- నా కీవేషధారణ ముండియుండదుగదా! కానిమ్ము విధి నెవ్వరు తప్పింపఁగలరు? గోడలకు చెవులుండును. రహస్యముగ నీతనితో భాషించు నేల? తెల్లవాఁడినపిదప—నల్లరమొకట తెల్లముగనే చెప్పెదను మాయుల్లముల నెఱుఁగ నీయల్లరిమూక వశమా!

(కొంతదూరము నడచి ప్రకాశముగా)

నేను మేలుకున్నప్పు డూరంతా నిద్రబోవడ మెరుకునా ? ఒక్క పిట్టపురుగుని కన్ను మూయ్యానివ్వను.

ఢిల్లీసుల్తాన్ వట్టికపోతాన్
మూఁడేనెలలాకు వట్టిపోతాన్
సూరణ్ణిపేరణ్ణి ఖూనీ చేయిస్తాన్
గూడెల్ బొద్దల్ చేసి గోరి కట్టిస్తాన్.

(కేకలు వేయుచు నిష్క్రమించును)

(తెర వ్రాలును)



3 వ. రంగము :—[వల్లీఖానుని యిల్లు, చెకుముకిశాస్త్రి ప్రవేశము.]

చెకు—(స్వగ) "దండం దశగుణం భవేత్" అనునట్లోరుగంటిలోనఁ గొట్టిన దెబ్బ యీనాఁటికిట్లు నాకుపకరించినది నన్ను చూడఁగనే వినయముతో సలాముచేసి- వల్లీఖానునకు నారాక నెఱిఁగింప నరిగినాఁడు.

ఢిల్లీఖానుఁడు ప్రవేశించును.]

వల్లీ—సలాం- సలాం- బేతాల్ జోష్యులు భాయ్- సూకోండి—

చెకు—చాలుచాలు లెండి- మీ మొగమునెనటి మర్యాదలు నే నెఱుఁగకపోలేదు ఈ యుచ్చకములు- అచ్చికబుచ్చికమాటలు కట్టిపెట్టుఁడు ముగట కూర్చుండుఁడు.

వల్లీ—ఏం భాయ్- ఘుసా సేస్కుంటారూ? (కూర్చుండును.)

చెకు—నా ఘుసా నాతోడనే యుండును గాని- నిన్నేమి చేయుదు? భాయీ భాయీ అని పలికి నమ్మించి సుల్తానుదర్శనము చేయించెదనని, మోసగించి ఢిల్లీకి నచ్చితిరిగదా!—మీరు నన్ను వదలించుకొనినను, ఏలినవాటికినివలె మిమ్ము వదలువాఁడను గాను. ఇది తురకరక్తము గాదు- బ్రాహ్మరక్తము.

వల్లీ—భాయ్ నేనువచ్చేతప్పుడు వున్న హావ్షరంమీద తమకీ కల్సుకోటాన్కి పుర్సత్ లేకపోయింది.

చెకు—చాకలిపేరిగానిని పట్టుకొనవచ్చు నవసరమే నాకు బలే బలే! గొప్ప ఘనకార్యమున నన్ను మఱచిపోయినారు. (నవ్వును.)

వల్లీ—గేలీసేస్తారేం భాయ్? చాకలియేమిటి?

చెకు—మీరు దాచుకొనిన దాగునని కొంటిరా యేమి? చాకలిపేరిగానిని మీరు రాజునకొని జనార్దనమంత్రి మోసమునం బడిన తెలివితేటల కందఱును గేలిచేయుచుండఁగా నే నొక్కఁడను గేలిచేయుట లెక్కయేమి?

వల్లీ—భాయ్! ఇది నిశ్చయం వుంటుందా?

చెకు—ఆ! ఇది నీ నిశ్చయము గాక నా నిశ్చయమా!- రాజును వేటలో పట్టవలయునని, మీరు నడనికి బయలుదేఱిననాఁడే రాజు పురము చేరినాఁడు. రాజును జనార్దనుఁడును గలసి, చాకలిపేరి

గానీ రాజువస్తువులు తగిలించి యడవిలో నుంచినారు. వాడు మీకు పట్టుబడినాడు.

వలీ—భాయ్! మాకు విశ్వాసం కల్గటంలేదు ఎందుక్కా అంటే- రాజా కాకపోతే హంతా షౌర్యం హాంక్కీ యెక్కడ్డీ?- పట్టుకోటాన్కి మాకీ హాలా కష్టం తిప్పిస్తే- వత్తుమూదూ యేసి పట్టినాం- ఆడు సంపిన షేనా హంతా హింతా కాదు! హాకల్కి పట్టాలేదూ భాయ్! రాజ్కి పట్టినాం—

చెకు—రాజును పట్టలేదు. భాయీ! చాకలిని పట్టినారు. మీకు రాజనుభ్రమ కల్పించుటకై యుప్రతాపరుద్రుని ఖడ్గమును వానికిచ్చినారు. అది పరప్రసాదలబ్ధమైన కత్తి. అది చేతిలో నున్నంతవఱ కెవ్వరును గెలువలేరు. ఆశౌర్యమంతయు- కత్తిది గాని చాకలిది గాదు! మీరు దానిని తెలిసికొనలేకపోయినారు.

వలీ—అరే! ఎంతమోసం- భాయ్- మాటా గీటా హంతా చాకలి మాటగా తోసటంలేదు.

చెకు—(పెద్దనవ్వునవ్వి) ఇది తెలిసికొనలేకపోయినారా! ఒక్కరాత్రి యంతయు చాకలిని దగ్గఱ బెట్టుకొని రాజును జనార్దనుడును వాని కాపాఠము చెప్పినారు.

వలీ—జోష్వాలూ భాయ్- మా దిల్ హంతా ఖరాబ్ ఐపోతూంది!- ఐతే- మేం రాజాకీ పట్టటాన్కి జంగిల్కి యెళ్లేమాటా జనార్దన్మంత్రికి యెలాగ తెల్సింది!

చెకు—జనార్దనమంత్రి మీ నౌఖరీకొలకు పంపిన పరివారమంతయు వారి వేగులవాండ్రే- గాని చాకళ్ళు మంగళ్ళు కారు. మీ గుడారమునందు- చీమ చిటుక్కుమనినను- వెంటనే యది మంత్రికి తెలియుచున్నది.

వలీ—భాయ్! యుగంధర్ కేడూ కదా అని మేం సాలా నిర్భయముగా

వుంటే- జనార్దన మంత్రి అంతకీ హెక్వా మోహం తల్సినాడ్!
మరీ ఖుస్రూము స్తఫాపిరోజ్లఘతీ యేమైంది ?

చెరు—మీామ స్తఫాఖా నంతతుచ్చుఁడు నీచుఁడు లేఁడు. వాఁడు తెగ
తాగి- యొక తెలుగుపిల్లను లేవదీసుకొని ఢిల్లీకివచ్చి దానికి
ఫాతిమాబీబీ యని పేరుపెట్టి మహానందసముద్రములో తేలి
యాడుచున్నాఁడు.

వలీ—అపసూచార, నాంతా మాకీ తెలుస్తానేవుంది.

చెరు—ఫిరోజురు యుద్ధములో చంపినారు.

వలీ—హల్లా-హల్లా- యేంగాపారం రా! (స్వగ) మాకీ వొకపీడా
వొదిలీపోయింది.

చెరు—ఖుస్రూ హడలిపోయి సేనను వదలి- ఢిల్లీకి వచ్చినాఁడు. రాజు
ను కట్టలేదు. చాకలిని పట్టితిపని నిన్ను బెదరించుట కిప్పుడు
నీదగ్గఱకు వచ్చును. రామేశ్వరమున యుగంధరుఁడు చచ్చి
నాఁడు.

వలీ—(ఆలోచించుచున్నాఁడు)

చెరు—(స్వగ) తనగుట్టు బయల్పడకుండుటకై వీఁడు ఖుస్రూను ఖూనీ
చేయఁదలఁచుచుండఁబోలు.

వలీ—భాయ్! మాకీ జోష్యం చెప్పండి.

చెరు—చెప్పెదను- గాని నీ వబద్ధమాడి నాజోస్యమును పూర్వపక్ష
ము చేసితివా నే నీక్షణము వెడలిపోయెదను. నిజము నొప్పు
కొంటివా ముందు చేయవలసిన పనిని చెప్పెదను.

వలీ—హావమ్యాం వప్పుకుంటాం.

చెరు—నీవు ఖుస్రూను ఖూనీచేసెదవు. నిజమేనా?

వలీ—భాయ్! మాకీ అనృద్దేషం కల్గినమాటా నిజం.

చెకు—అట్లయిన నీకు నీజాతకము చెప్పెదను. నీవు మూఁడు నెలలలో ఢిల్లీసుల్తాను వయ్యెదవు.

వలీ—(ఆనందోద్రేకము నణచుకొని) నాకీ గేలీ సేస్తావ్ బేతాల్ జోష్యులు భాయ్!

చెకు—నిన్ను నేను గేలిచేయుదునా? ఇట్లవమానపఱచుటకేనా నన్ను జోస్యము చెప్పుమంటివి?

వలీ—కోపం సేయకండీ భాయ్! మాకీ షుల్తాన్ యేలాగాజౌతాం అని మంవయాం త్సోచీ ఆలాగా అన్నాం.

చెకు—నీయోగ మట్లున్నది. మేము సరిగా చూచి చెప్పినాము

వలీ—అదీ యెలాగాజౌతుందీ చెప్పండీ భాయ్!

చెకు—వినుము

సీ. శుద్ధాంతమందు ఖుస్రూఖాను నడికిరే
          యిఁగ, నికతన వధి యింపఁబడును
నేఁటనుండియు మూఁడు నెలలకు నొకరేయి
          నోడలో నెల్లరుఁ గూడఁగలరు
సులతానుఁ డారేయి నెలలేని సురఁ ద్రావి
          యొడ లెఱుంగక పడియుండఁగలఁడు
అపుడు సుల్తాను నీ వతినేర్పున వధించి
          ద్రుతగతి పట్టభద్రుండ వగుదు
వరయ నీజోస్యమున కింక తిరుగు లేదు
జరుగు నిదియంతయును భవిష్యంబునందు

ఇంక నాయోగము—

నన్నపుడు నీవోరంగలునందు రాజుఁ
జేసెదవు; దానిని జయించి శీఘ్రగతిని.

ఆపై నొక్క సంవత్సరమునకు నీకు కటకమును జయించుయోగము గలదు.

వలీ— అచ్ఛా భాయ్! ఇదీ అంతా జర్గితే- విరాకీ వొరంగం కొట్టియా యటం ఛనం.

చెకు—ఇప్పుడు రెండునిమిషములలో నీతో సంభాషింప ఖుస్రూ ఖాను వచ్చుచున్నాఁడు. నే నిట నుండరాదు. వానికి సందియ వలదు. చాళి కాఁడు రాజే యని బుకాయింపుము. నేఁటికి వానికి సుల్తానుదర్శనము కాదు. రేపు చెప్ప నుద్దేశించును. నేఁటి రాత్రియే వానిని సఫా- నేనింక నరిగెద- జాగ్రత్త.

[జవాను ప్రవేశించును.]

జవా— సలాం బందగానే ఆలీ—

వలీ—క్యా హై రే ?

జవా—ఖుస్రూఖాన్ సర్దార్ తేరాదర్శన్ కే లియే ఆగయాహై.

వలీ—అచ్ఛా ! ఆనేదేవ్.

జవా—(సలాముచేసి నిష్క్రమించును )

[ఖుస్రూ ప్రవేశించును.]

ఖుస్రూ—సలాం- వలీఖాన్ సరదార్ సాహెబ్ !

వలీ—సలాం- సలాం- భాయ్- బైఠియే.

(ఇద్దఱు కూర్చుందురు )

ఖుస్రూ—సర్దార్ సాహెబ్ ! వరంగల్ మే క్యాకాం హువా?

వలీ—క్యా హువా ?

ఖుస్రూ—ములుక్ తమాం పుకార్ హై- కీ- ఆప్ రాజాకా బదల్ కే మహాల్యాకా పకడ్ లియాహై.

వలీ—ఝూటా బాత్ హై- ఝూటా బాత్ హై- హాం బరాబర్ రాజాకూ పకడ్లియా.

ఖుస్రో—నహీఁహై- అప్ జనార్దన్కా పట్టీమే గిర్గయా హై.

వలీ—హాఁ దివానా నహీఁహై ఖుస్రోఖాఁ.

ఖుస్రో—నహీఁ-సర్దార్-జనార్దన్భీ దివానా నహీఁ హై.

వలీ—ఓ దివానా నహీఁహైతో- మై రాజాకూ కైసా పకడ్లియా.

ఖుస్రో—రాజాకూ నహీఁ-మసాల్యా జీ!

వలీ—తూ పగ్లా హై క్యా?

ఖుస్రో—మై పగ్లా నహీఁ హై- జో మసాల్యా, దేఖ్ కర్ రాజా కూ సమజ్లియాసో పగ్లాహై.

వలీ—బాత్ బరాబర్ కరో ఖుస్రో!

ఖుస్రో—మేరా బాత్ బరాబర్ హై- ఆప్కా కాం తో ఖరాబ్ హై.

వలీ—మై వలీఖాన్ సర్దార్ హై ఖుస్రో- ఖబర్దార్.

ఖుస్రో—హాఁ !-వలీఖాఁ సర్దార్ హై- నమ్మక్హరాం కాం కర్నే వాలా బడావస్తాద్ హై- మసాల్యా పకడ్నే వాడా బడా శూర్ హై.

వలీ—(పండ్లుకొఱుకుకొను) నమ్మక్హరాం- నమ్మక్హరాం - కౌన్ నమ్మక్హరాం.

ఖుస్రో—నమ్మక్హరాం-కౌన్ హై-మై బతావుంగాం.

వలీ—బస్ ! బస్ !- ఔర్ బాత్ మత్ కరో ?

ఖుస్రో—బాత్ నకరుంగా ! కాంతో కరుంగా. (నిష్క్రమించును.)

వలీ—జా ! రే ! దివానా జా !- తేరీ జాన్ హైతో కాం కరో !-

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

4 వ రంగము :— ఖుస్రూ అంతఃపురము.

[ఖుస్రూ, భార్యయగు దరియాబీబీయు శయనించియుండఁగా, ఖడ్గపాణియై వలీఖాను ప్రవేశించి ఖుస్రూను చంపుచున్నాఁడు]

ఖుస్రూ—(వెఱ్ఱికేకలు వేయుచు మరణించుచున్నాఁడు.)

దరి—(అదరిపడి లేచి) క్యా హోతా హై?

వలీ—చూప్ రహెూ! దూర్ జావ్!

(కటారి చూపును.)

దరి—(భీతితో పతిని చూచి) హా! అల్లా! పర్వాదిగార్-మెరీజాన్ నికల్ గయా! మెరీజాన్ గయా- (మూర్ఛిల్లును.)

వలీ—ఏ సైతాన్ భీ మర్నా. (కత్తి యెత్తును.)

[చెకుముకి శాస్త్రి ప్రవేశించును.]

చెకు—(చేయిపట్టుకొని) వలీఖాన్! ఇది యేమిపని? ఆఁడుదానిని చంపెదవా?

వలీ—ఇదీ రహస్యం బైటా వేస్తుందీ శాస్త్రీజీ!

చెకు—జోస్యునుపరిహారము రెండుగడియలలో దీనికి సిచ్చిపట్టనున్నది. ఇది నిన్నేమియుఁ జేయదు. నే నీనిక్కపుగుడ్డలగుఱుతైన లేకుండ శవమును పాతి వేసెదను. నేనిచ్చినసారాయి త్రాగి ద్వారమునందలి భటులు పడిపోయినారు. నిర్భయముగ నావలకుఁ బోవుదము.

(ఇద్దఱు శవమును మోసికొని పోవుదురు)

(తెర వ్రాలును)

ఇది తృతీయాంకము.





శ్రీ

# ప్రతాపరుద్రీయము.

## చతుర్థాంకము.



1 వ రంగము.

ముస్తఫాఖాను మందిరము.

[ప్రవేశము:—ముస్తఫా, ఫాతిమాబీబీ.]

ఫాతి—ఒకనిర్ణయమున నుండువానితో మాటలాడవచ్చును గాని-క్షణమున కొకమాటాడు స్వభావముగలవాని నెట్లు నమ్మవచ్చును?

ముస్త—అగే ఫాతిమా! నీదీ ఛమక్ జమక్-రంగ్ రింగ్-సూరత్ గీరత్ డౌల్ గిఫ్రుల్- మాదీకండ్లూతిని-ప ట్లు యిగ్లిస్తే- ఖుషంకోసం వొళ్ళు-ముద్దు మేం ఖోరివాం- అందుకే మీకీ మామీద ఘుసా ఆమేతో మెల్గా భతుకుతాం- బోలో ప్యారీ!

ఫాతి—అంచలకుగానా- సుల్తానవై- నావ్రతముతీర్చి నన్ను ఢిల్లీకి రాణిం జేసిన తరువాత- నీయిష్టమువచ్చినన్ని ముద్దులు—నను మ నను నీకీ కంగా రెందుకు?

ముస్త—అగే ప్యారీ!- మేం నీదీమీద యెంతహమక్ అయినామో గులాం హైనాం బోల్తాం సునో.

ఫాతి—(స్వగ) వచ్చినట్లే యున్నది సరసము !

ముస్త—

—♦ పాట. ♦—

నీది ఘూనాసున్తే- నీది ఖట్లాఖుంటే- రామశిల్కాదీ ఖూతా
నీదిహాస్తం మిల్తే-నీది షూరత్ కంటే-రంభ వ్యూర్వషీ తాతా
నీదిఫావం చల్తే-నీదిసాదం తింటే-పేట్మే భర్నేకూ మేతా
నీది బుర్ఖతగిల్తే-చమక్ షూస్తాంటే-మూదిఫాణాల్కు-ఘూతా॥

మేం ఢిల్లీషుల్తాన్కూ మూండూ నిమ్సంగో ఖొట్టే- షుల్తా న్యాసూ హోతాం- మీాకీ షుల్తాన్ బీబీ షేస్తాం-అష్ఫూ హా మేషాం- మేంమీాఫా దాల్కాడా-మీాసమా ఘుండెల్కాడా-మూాడూవఖ్తుల్ ఖానా- ఆరువఖ్తుల్ పీనా- హా మేషాం నీదీత్తో సోనా.

ఫాతి—ఈడాబులకేమిగాని- నీవు ఢిల్లీసుల్తాను నెట్లు చంపి రాజ్యము నకు వచ్చెదవో చెప్పెదవా?

ముస్త—(పకపక నవ్వి) అగే! ప్యారీ! వాగీ వక్తీషూరత్వాం నీకీ యింఖా తెల్వనేలేగ్-ఎంతహామూవికం ! ఎంతహామూవికం నీకీ !

ఫాతి—(చికాకుపడుచు) ఎందుల కావెట్టినవ్వు ! అమాయికురాలను గనుకనే తెలుఁగుదేశమునం దెక్కడనో, కచేరీలు చేసికొని బ్రికుకుచున్ననే నాశపడి నీవలలోఁ జిక్కుపడితిని. నీమాయిక మేమో చెప్పరాదా!—

ముస్త—(నవ్వుమాని) ప్యారీ! నీదీ ఖోపం షూస్తే నాకీ బల్ ఖుషీహోతుందీగే ! (మరల నవ్వును.)

ఫాతి—అట్లయిన నేను వెళ్లెదను. (పోఁబోవును)

ముస్త—అరే! అరే! నువ్వుయెల్తే మేము వచ్చిపోతాం ప్యారీ! వస్తే మళ్లీ భక్తేదీ యెలాగా!

ఫాతి—మఱి-ఢిల్లీసుల్తాను నెట్లుచంపెద వని నేనడుగగా-చెప్పకుండ నూరక నవ్వెదేమి? నేశాకొళపుసు వేళా పాళా!

ముస్త—ఆ! ఆ! అలాఁగైతే షప్తాం యినూ ప్యారీ!

ఫాతి—చెప్పుము.

ముస్త—క. ఖాబూల్ సుల్తాన్కా మా
కీ బల్ జోస్తీ రహా; యగేప్యారీ సా
హేబుల్ లమ్కా౯ ఆకె-ఖ
బాబుల్ షేస్తారు- ఢిల్లి ఫాద్షా మాంసమ్.
మాలుం హువా?

ఫాతి—తెలిసినది. కాని నీ వింకను కాబాలునబాబుకు వ్రాయనేలేదే?

ముస్త—ఇయ్యాలా- జరూర్ రాయ్యాలావుంటాం.

ఫాతి—ఢిల్లీ ఫాదుషావైనదాక- నీవు నన్ను ముట్టుటకు వీలులేదు. తెలిసినదా ?.

ముస్త—మరియేం షేస్తాం?-నీదీ హుకుంకాతాబీ- కల్లాతో షూస్తాం- గల్లాతో ఘుట్కాల్ యేస్తాం.

ఫాతి—నన్ను నీవు నమ్మించితివి; మగవారి నెన్నఁడును నమ్మఁగూడదు. వారి కెదుటనున్నదే పెండ్లికూఁతురు. నీవు సుల్తానువైనపిదప నన్నే రాణిం జేసెద వని నాకేమి విశ్వాసము! నావంటివారు నీకు వేనవేలు.

ముస్త—అరే! అరే! కైసా బాత్- కైసా బాత్- నీకీ యిడ్స్పెడితే మాదీ జా౯ యిడ్స్పెడ్తాం.

ఫాతి—సరే! ఆమాటలకేమి? ఎందుకైనమంచిది. అట్లు నన్ను రాణిని చేయుదు నని వ్రాసి యిమ్ము.

ముస్త—హాఁగే! నీకీ హెంతా హాన్మాసం వుంటుందీ.

ఫాతి—నాకుగాక, నీ కేమియనుమానము! సుల్తానువగువాఁడవు నీవు; నేను నావెనుకటికూటిలో మన్ను బోసికొనివచ్చితిని. నీవు

సుల్తానువు కాగనే నిన్నువలచి యనేకమంది చేరుదురు. అప్పుడు నేను రెంటికిఁ జెడినరేవణి నగుదును.

ముస్త—ప్యారీ! నీకీ వసంయం యెందుకూ? ఆలాగా హావమ్వం వ్రాసి యిస్తాం.

ఫాతి—ఇప్పుడు వ్రాసి యిమ్ము.

ముస్త—కైసా, నాకీ తెలంగీ రాదూ—నీకీ ముసల్మానీ రాదు.

ఫాతి—నీకు తెలుఁగుభాష రాకున్నను నాకు హిందూస్తానీ వచ్చును. వ్రాసియిమ్ము. (స్వగ) చిన్నతనమున నేర్చుకొనిన హిందూస్తానీ యిప్పు డుపయోగించినది.

ముస్త—అరే! ఎంతహాశ్చ్వర్యం! నీకీ ముసల్మాన్ బాత్ తెల్సును!

ఫాతి—ఎంత తెలుఁగుదేశమందున్నను, తురకదానికి హిందూస్తానీ రాకుండునా?

ముస్త—మరీ- పాడూబొమ్మన్ తెల్గూ బాసా యెందూకూ కర్తావ్ ప్యారి

ఫాతి—నాకు మాటాడు నభ్యాసము తెలుఁగుదేశమున నగ్గిపోయినది!

ముస్త—అదీ ఖాకుంటా నీదీ మొఘుందిూదా ఘుంకాంబొట్టు పెడ్తే—బొమ్మనాకూ ఔరత్ లాగా వుంటావు హారీ!

ఫాతి—ఏదియో చెప్పి నన్ను మఱపించుచుంటివా?

ముస్త—మర్సి పోలేదూ ప్యారీ! మర్సిపోలేను.

(వ్రాసియిచ్చును.)

ఫాతి—(చదువుకొని) ఇది చాలును—మఱి నేఁడే కాబూలునకు వ్రాయవలెను.

ముస్త—ఝురూర్గా! రాస్తాం—ప్యారీ నాకీ వొక్కముద్దు.

ఫాతి—(కోపముతో) తిరిగి ప్రారంభించితివా! ఇట్టిచంచలుఁడవు నీవు సుల్తాను నెట్లయ్యెదవు! నన్నురాణి నేమిచేసెదవు? ఇదుగో నీకాగితము నాకక్కఱలేదు—నీసంబంధము నాకక్కఱలేదు.

(మీఁద విసరును.)

ముస్త—(చెంపలు వేసికొని) తోబా- తోబా-మల్లీ మాదీ బుద్ధీ ఘూస్ తినిందీ ప్యారీ! ఇంకొఖమాట సెప్పను—ఖాత్రం తీసోక్.

(ఇచ్చును.)

ఫాతి—(నిర్లక్ష్యముగఁ దీసికొనును.)

[తెరలో]

"ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
మూఁడేసల్లాను పట్టుకపోతాన్"

ఫాతి—అమ్మో! పెజ్జీవాఁడు కాఁబోలును! వానినిఁ జూచిన నాకు మిగుల భయమగును.

ముస్త—నువ్వు కోపల్కి వెల్లూ- నేను కాబూల్ కీఖత్ రాస్తానూ.

ఫాతి—(నిష్క్రమించును,)

(పెజ్జీవాఁడు—భటులు యిద్దఱు ప్రవేశింతురు.)

పెజ్జీ—నాసుల్తానూ! నాసుల్తానూ! నా ఢిల్లీసుల్తానూ! నాముస్తఫా సుల్తానూ! నా ముద్దులసుల్తానూ! చూఁడు-చూఁడు-సైతానులు నావెంట ఒడ్డారు!- వీళ్ళను కొట్టు- వీళ్ళకంట్లో మిరపకారం బెట్టు- వీళ్ళవీపులమీద అట్టుదేలేట్టు కొట్టు- వీళ్ళనూళ్ళోంచ వతలికి పడనెట్టు- వీళ్ళ బోడిగుళ్ళమీద మొట్టు- నాసుల్తాన్! నాబంగారుసుల్తాన్! నాముస్తఫాసుల్తాన్!

(భయముతో దగ్గఱకొదిగి కూర్చుండును.)

ముస్త—(భటులతో) అరే! పకడ దూర్ కరో! ఇస నాఘరా-

భటు—అచ్ఛాసర్దార్! (నిష్క్రమించును.)

ముస్త—అరే! దివానా! నిన్ను షూస్తే- మాకు బల్ యినోదం వుంటుంది! ఇదర్ బైఠో.

వెట్టి—నాబంగారుసుల్తానూ! నే నేలరుగునిూద పడుకుంటే ఆ అరుగునిూది కొచ్చి సైతాన్లు నన్నుచంపేస్సినై- నేను నీ అరుగు మీాదే పడుకుంటా!—

ముస్త—దివానాసాహెబ్! నీకీ బయ్యంలేదూ! అక్కడ పండుకో!-

(వ్రాయుట నభినయించును)

వెట్టి—(పండుకొని) అందరికి పెళ్ళాలుంటే నాకు లేదనుకుంటున్నారు వెధవలు- నాకు నాగొంగడిరాణి ముద్దులపెళ్ళాం- మురిపేల పెళ్ళాం- కాసులపెళ్లాం కడియాల పెళ్ళాం- పెళ్ళామమ్మా! పెళ్ళామమ్మా! (గొంగడితో ముద్దులాడుచు) నీకుకధచెప్పనా? కధ చెప్పనా? పాటచెప్పనా?- ముందు పాట చెపుతా!- తరువాత కధచెపుతా—

కాళ్ళాగజ్జా - కంకాణమ్మా
వేగులచుక్కా - వెలగమొగ్గా
దూదీకుప్పా - పడమటిపంఘూ
రాజుగారితోట్లో - యేముందంటే
కవ్వైన ముప్పైన - కాల్దీసి కడగా- పెట్టు.

పెట్టు- ఊఁ! పెట్టమంటే పెట్టవూ? నామాటవినవూ! దొంగముండా! తురకరండా- నిన్నుచంపేస్తా- (గొంగడిని కొట్టి కొటికి అవతల పారవేసి) పో! వెధవా! పో! మొగుడులేక ఏడుస్తావులే! పో!- (చలినభినయించి) ఊహుహుహుహుహుహు- అబ్బా! చలిచలి- (వణుకును.)

ముస్త—(వ్రాసుకొనుచు నే వెట్టివాని చర్యలు చూచి నవ్వుచున్నాఁడు)

వెట్టి—చలి పుట్టినా సరే! చచ్చినా సరే! నిన్ను దెగ్గఱికి రానియ్యను! నేను చలిమంట వేసుకుంటా!-

ముస్త—(ఉత్తరం పూర్తి చేసి సిరా అద్ది- అద్దిన కాగితము క్రిందవేయును.)

వెట్టి—చలిమంటకు నాబంగారుసుల్తాను దెగ్గఱి చిత్తుకాగితాలన్నీ ఏరుకుంటా- (అన్ని కాగితములతో పాటు అద్దిపాఱవేసిన కాగితము నేరుకొని దానినిమాత్రం జాగ్రత్తపెట్టుకొని మిగతకాగితముల మంటవేయుచున్నాఁడు.)

చలి చలి చలి చలి చందానవ్వా
కుంపటి దేవే గుడ్డెవ్వా.

ఉహుహుహుహుహుహుహు— (చలికాచుకొనును)

ముస్త—(ఉత్తరము మడుచుచు లేచి) దివానాసాహెబ్ !- పెల్లాంమీదహల్లీ- ఏందుకు- హావస్తా పడ్తారూ?- మల్లీ సంసాయించుకొండీ జీ!

వెట్టి—(కోపముతో చూచి) ప్రతివాళ్ళూ నాకు బుద్ధిచెప్పడమేనా?— నేను నా పెళ్ళాన్ని కొట్టుకుంటే వూరివారందరికీ యేమి? అమ్మ నాయనో! పెళ్ళాన్ని తురకాళ్ళింటో వొదిలేస్తే- ఎత్తుకూపోతాడ్రో బాబూ! (గొంగడిపోసుకుని) నా పెళ్ళామా రావే!- నాతల్లీ రావే!- నాపిల్లలతల్లీ రావే!- ఛీ! ఇక్కడ మనముండొద్దు రా!

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
మూడేసల్లాకూ పట్టుకపోతాన్

సూరణ్ణిపేరణ్ని ఖూనీచేయిస్తాన్
గుండెల్ బద్దల్ చేసి గోరీకట్టిస్తా.

(ముస్తఫా నవ్వుచు మూసుకుమసుకు- వెట్టివాడు కేకలు వేయుచు నిష్క్రమించును.)

(తెర వాలును)

## 2 వ. రంగము.

[ఢిల్లీపురవీధిలోన వెట్టివాడు, వెనుక సమూహము.]

వెట్టి— —♦ పాట ♦—

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
మూడే నెల్లాకీ పట్టుకపోతాన్.

... ... ... ...

విదియనాడు గనపడకపోతే †తదియనాటిచంద్రుడు తానే కనపడతాడు. చెకుముకి దొరికితే యీపుల్లాకులన్నిట్నీ నిప్పుచేసి తగలబెట్టుకుంటును. దాగ్లో దువ్వన్నీ నాకడ్డాలెందుకూ- నాపేరు నీకెవరు చెప్పారంటే నీమొహమే చెప్పింది తిమ్మన్నాలన్నాట్ట- ఎంతవాళ్ళుగాకుంటే యింతవాడికి పరియోగం జేశారూ? కరక్కాయలు నమల్లేక- కంగారుపడితే నన్నుజూచి నవ్వారు! పొండిరా! ముండల్లారా! కరక్కాయలు కక్కేస్తాలెండి- కక్కేస్తే మీరంతా కుక్కలౌతారు. బ్రాహ్మళ్లోయ్- బ్రాహ్మళ్లోయ్-మీకందరికీ తలాపిల్ల కాసూదతుణ- ఇంద- ఇంద-ఇంద-ఇంద- (ఇచ్చుట నభినయించును) ఇంకా యెవరైనా మిగిలేరా- (కొందరినిచూచి)మీరంతా మిగిలేవున్నారటయ్యా!ఇస్తావుండండి (కొన్నిరాళ్ళేరి- అకస్మాత్తుగాతుమ్మి) ఇంకమీకివ్వను. అపశకు

† చెకుముకిశాస్త్రి.

నమైంది- పోండి. (రాళ్ళు పాఱవేయును) వెధవకప్పదాల్లు- తుర కాళ్ళకి శకునమేమిటి?- నేను తురకాణ్ణా- దున్నపోతునా! బ్రాహ్మణ్ణి ! పందినా ? మనిషినా- మూకునా? బ్రదికున్నానా- చచ్చానా? చచ్చానోరి ! నాయనా చచ్చానోరి!- మొన్నపొద్దున్నపదిహేను గంటలు డెబ్బయ్యాక నిమిషాలకు చచ్చాను. నాకోసమెవరేడుస్తారు? నేనే ఏడుస్తా. (ఏడ్చి ఏడ్చి-ద్రిష్టలనుచూచి) మీరంతా యెందుకేడవరూ ? ఏడుస్తారులెండి- ఏడుకట్లసవారీవొస్తే ఎండలో నిలవబడి యేడుస్తారు- మీరేడిస్తే నేను నవ్వుతా- (పకపకవకనవ్వి) అబ్బో! నేను బాగానే నవ్వఁగలను రోయి! ఎంతనవ్వగలనో అంతయేడవగలను- ఎంతయేడవగలనో అంతయేడిపించగలను.

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
మూఁడే ... ... ...

[చెకుముకిశాస్త్రి ప్రవేశించును.]

వెఱ్ఱి—(చెకుముకిశాస్త్రిని చూచి చూడనట్లు నటించి యొకకుక్కను జూచి) అగ్గిరాముడా! నువ్వొచ్చావురా! ఎంతెంతపన్లు చేశొచ్చవురా?- వాలిగుంటలో దూకావు- గంజీతాగావు- బొయ్యిఁ బొయ్యిఁ బొయ్యి యనీ మొరిగావు-మామల్లిగాడు నిన్ను పెంచితే పుల్లిగాడు వెళ్లగొట్టాడా నాయనా ! నేను నీకింత బువ్వ వేస్తాలే భయపడకు- నగఁ పెట్టుకోయి ! దొంగలోరి- కత్తిదీసుకొని దొంగచెవులుఁగోసి, నగలపెట్టి జాగ్రత్తగా కాపాడు- మాట్లాడవేం- ఓరినిర్భాగ్యుఁడా ! నీగుణం పోతుందిటోరి- కనకపుసింహాసనమేమయుందిరా! వెళ్ళు నాదెగ్గర్నించి- చచ్చినతోళ్ళు దయ్యాలౌతాయట !

(కుక్కనుకొట్టగా మొఱుగుచు పోవుచున్నది.)

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్

... ... ... ...

చెకు—(స్వగ) ఆహాహా ! ఎంతదయాశాలి ! ఎంతమేధాసంపన్నుఁడు. సర్వవిషయములను బోధించినాఁడు. నా కథయిచ్చినాఁడు. అగ్గిరాయఁడా యని చెకుముకీ యని సూచించినాఁడు. విద్యానాథుఁడు దయచూడగా- జనార్దనుఁడు విడచినాడా యని జాలినంది నాకింతయన్నము తాను వేయుమనుచున్నాఁడు. తనకలచేఁ జిక్కిన ప్రతాపరుద్రుని నగలును ఖడ్గమును హరింపుమనుచున్నాఁడు చచ్చినఖుస్రూలును దయ్యముచేయుమనుచున్నాఁడు. ఇల్లే నడిపెదగాక?

వెట్టి—(ద్రవ్యమునుచూచి) ఓహోహో ! నాయింటికి- నాపెళ్ళికెంతమంది బ్రాహ్మలొచ్చారు ! బ్రాహ్మణసంభావన- బ్రాహ్మణసంభావన- ఇంద-ఇంద- పట్టండి- తలాపిల్లకాసు- ఇందాక తుమ్మొచ్చిమానేశా- పట్టండి- పట్టండి.

(అందఱికీ సన్నరాళ్లు కాగితాలలో పొట్లాలుకట్టి యిచ్చుచున్నాఁడు)

అందఱు—(నవ్వుచు పుచ్చుకొనుచున్నారు.)

వెట్టి—(ఒకకాగితపుపొట్లమును చెకుమునకిచ్చును.)

చెకు—(పుచ్చుకొని స్వగ) రాళ్ళలో నేమియును లేదు. కాగితము వ్యర్థమైనదై యుండదు. చూతము.

వెట్టి—(ఒకనికి తేలును పొట్లముకట్టి యిచ్చును.)

వాఁడు—(తేలు కరవగా నేడ్చును) బాబూ ! చంపేశాడ్రో చండాలుఁడు ! తేలు కర్చిందిరా నాయనా !

(బాధపడుచుండును)

(కొందఱు నవ్వెదరు, కొందఱు తేలును చంపుదురు)

వజ్రీ— ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
మూండేనెల్లాకు పట్టుకపోతాన్
సూరణ్ణి పేరణ్ణి ఖూనీసేయిస్తాన్
ఘుంజెల్ బద్దల్ చేసి ఘోరీ కట్టిస్తాన్.

(కేకలు వేయుచు నిష్క్రమించును)

(తెరవ్రాలును)

3 వ రంగము

వలీఖానుగృహము.

[వలీఖాను, చెకుముకి శాస్త్రి ప్రవేశము]

చెకు—ఇప్పుడు నీవు చెప్పుమని బలవంతెను చేయుకున్నను నేను జోస్యము చెప్పుటకే వచ్చితిని.

వలీ—చెప్పండీ భాయ్ హావమ్వాం.

చెకు—త్రాగుబోతయినను మీముస్తఫా సామాన్యుఁడు కాఁడే; దురాశాపాతకుఁడు!_

వలీ—ఏమిచేచినాడ్? ఏమిచేచినాడ్?

చెకు—ఢిల్లీసుల్తానును మ్రింగి వల్లీఖానును నల్లివలె నలుపనున్నాఁడు!

వలీ—హారే! హారే! అదివానాకీ హాంతాషక్తీ వుంది?

చెకు—బువ్వలేకున్నను బుద్ధులకేమితక్కువ?

వలీ—అది యెలాగాతల్సినాడ్ చెప్పండి భాయ్?

చెకు—(యొకయుత్తరమిచ్చి) ఇదియెవరివ్రాతయో గుర్తింపఁగలవా?

వలీ—(ఆశ్చర్యముతో) అరే! అరే! ఇది హావమ్వాం ముస్తఫా దస్తూరీ-కాబూల్ వాడ్కి రాస్తాడూ.

చెకు—(ఇంకొకయుత్తరమిచ్చి) ఇది యెవరివ్రాతయోగుర్తింపఁగలవా?

వలీ—అరే! భలేమోసం- ఇదీకూడా ముస్తఫా దస్తూరివుంది. తానూ

ఢిల్లీసుల్తాన్ అవితే-సీకీ రాణీపేస్తాఁ అని వ్రాసియిచ్చినాడ్ మీకీ యిది యెలాగాదొర్కినాయ్ ఖాఁయ్ ?

చెకు—మీరందఱు కన్నులుమూసికొనియున్నారు? ఇదేనా మీరాజ నీతి ?

గీ. ధీరుఁడై ముస్తఫాఖాను డిల్లి నేలఁ
దలఁచి, కాబూలుదాని కుత్తరమువ్రాసి
కుంటలకు ధికార మీఁ దలఁచియుండఁ
గనులు మూసితిరే! కొంప గాలువేళ.

వలీ—(కోపముతో) అరే! అరే! రాత్ దిన్ హమేషా పీనేవాలా-కైఫ్ మే సోనేవాలా- ముస్తఫాఖాన్ యింతమురుద్దేశంతో వుండే తప్పుడు నాస్కి- ఖత్ కానిచ్చేదీ అబ్బు- ఆడ్కి కూడా- ఖుస్రొ ఖాన్ దగ్గర్కి పంపియేస్తాం-.

చెకు—ఇప్పుడు వానివిషయమై నీ వేలతొందరపడెదవు?

వలీ—వాడూ యిప్పు మాకీ ప్రతిస్పర్థీ అవినాడ్ ఖాఁయ్!

చెకు—వానిలేఖ నాచేతపడెను గదా! నీ కేల కంగారు ?

వలీ—హాఁ- హాఁ- మర్చిపోయినాం- ఈ చీట్లుమీకీ యెలాగా దొర్కినై జోష్వాలూఖాఁయ్ !

చెకు—ఎట్టియధికారి కట్టినాఖరులే దొరుకుదురు! మట్టిబుఱ్ఱ ముస్తఫాఖాను తనయుత్తర మెవరిచేతఁ బడిన గతియేమనియైన విచారింపక, త్రాగుబోతుకొకని కీయుత్తర మిచ్చి కాబూలునకుఁ బొమ్మని పంపెను. వాఁడు తెగత్రాగి యూరిబయట పడియున్నాఁడు. కనుచీఁకటివేళ నేను బయలునకు వెళ్ళి మరలి వచ్చుచు వీనిఁగని, యనుమానించి- ఎంగిలకైన మంచి దని యంగీలోన వెదకగా నదృష్టవశమున నిది లభించినది. అప్పుడు వానికనుమానము గలుగకుండ, ముస్తఫా కాబూలుసుల్తానుం

బరిహాసించిన ట్లుత్తరము వ్రాసి తిరిగి వానిజేబులో నుంచితిని.

వలీ—బలే! బలే! జోష్యులూభాయ్! బుద్ధి వక్తీ హాకాసం అంతా వుంటుందీ- మరి యీ రొజ్దోచీటీ ?

చెకు—ఈచీటిని నేను ఫాతిమూవలననే సంగ్రహించితిని.

వలీ—అదీ మీాకీ యెలాగా దోస్తి షాస్త్రీభాయ్!

చెకు—తెలుగుదేశమందు నేనుకొన్నాళ్ళు దీని నుంచుకొంటిని.

వలీ—బలే! బలే! భేతాళ్ భాఙ్ సహాయం మాకీ నిండా అవిపోయింది! ఈబాకీ మేం యెలాగా తీర్చుకుంటాం తెల్వటం లేదు.

చెకు—తెలియకేమి? ఒరంగలును కొట్టి నన్ను బోడి యన్నప్రతాపరుద్రు నీడ్చివేసి నాకు రాజ్య మిచ్చెద నని పలికినది మఱచితివా ?

వలీ—అదిమేం- యెల్గామరుస్తాం షాస్త్రీజీ! ఇప్పుడు హంతా తమ సహాయం కదా మాకీ!

చెకు—వీనికేమిలే! నీవు నన్నుమోసగించి, వోరుగంటినుండి రాలేదా? నిన్ను నేను నమ్మను. న న్నోరుగంటిరాజును చేసెదనని వ్రాసి యిమ్ము.

వలీ—భాయ్! మీాకీ హాలాగా యోచనా వుంటే యీాఖనం వ్రాసీ యిస్తాం.

(వ్రాసి యిచ్చును.)

చెకు—మంచిది. ఇప్పుడు మాకు నిర్భయము!

వలీ—మరీ- షల్తాన్కీ- కొట్టేతాన్కీ- ముస్తఫాకీ మఖాసీచేదాన్కీ- జోష్యం చెప్పండీ జీ!

చెకు—చెప్పెదను. వినుము. ఇంక సిరువదిదినములలోపల గోవాపురి నుండి గొప్ప రత్నవర్తకులు వచ్చి సుల్తానుదర్శనము చేయుదురు అప్పుడు, రత్నముల వెలలు తీర్మానము చేయుటకై- చెట

లో నున్న చాకలివానిని, నియమింతురు. వాఁడు వేసిన అంకెలు వర్తకులకు సమ్మతియగునచో సుల్తాను వారియోడలను చూచుటకై- ఆరాత్రి సపరివారముగ నోడలో చేరును. అచ్చటనే సుల్తాను ముస్తఫాలవధలను గావించి నీవు ఢిల్లీసుల్తాను వగుదువు.

వలీ——షోబీవాలాకూ- రత్నంవ్యవహారం యెలాగా తెలుస్తుంది షాస్త్రీజీ?

చెకు——అదే సంశయము!- వానికి తెలియక యేవో అంకెలు చెప్పినచో- వారి కిష్టము లేకపోవుటయు- ఓడల కరుగకపోవుటయు సంభవించునేమో యని విచారించుచున్నాను.

వలీ——అందుక్కా- యేంచేయవల్సివుంటుందీ భాగ్!

చెకు——మనము, మొదట రత్నవర్తకులను కట్టుకొని వారి ధరలకు మించిన మొత్తమును- మనకుతమైనందులకు లంచమును సమర్పించుకొనినచో- చాకలి యేఅంకెలు వేసినను వారు సమ్మతింతురు. ఈయుపాయముచే నోడలలోని కరుగవచ్చును.

వలీ——ఆపని సర్వం తమరుచెయ్యవలా కోర్తాం- అందుకూ యెంత డబ్బు కావాలా చెప్పితే- యిప్పడే యిస్తాం.

చెకు——నీ ఆస్తియంతయు విక్రయించినను వారి రత్నములకు సరిరావు.

వలీ——మరి యేమిగతి?

చెకు——ప్రతాపరుద్రుని కత్తియు, నాభరణములును మీవద్ద నున్నవి గదా! వాని తాకట్టుధనమువలననే ఈమొత్తము సంపాదింపవచ్చును. నాకు సెలవిచ్చినచో వాని నొక్కొక్కటిగా యొక్కొక్క ధనికునివద్ద నీయూర తాకట్టుపెట్టి ఆధనమును వారి కిచ్చి లోబఱచుకొందును. నే నోరంగల్ రాజునైన పిదప వానిని విడిపించుకొందును.

వలీ—(రయమునఁ జని, కత్తియు నాభరణములపెట్టెయుఁ దెచ్చి యిచ్చును.) ఆహనీ షేయాండీ భాయ్

చెకు—(సరిచూచుకొనును.)

వలీ—జోష్యులూ భాయ్! మరి షుల్తాన్కి చంపటాన్కి యెలాగా చెప్పినారుగారూ?

చెకు—ఇది యతిసులభము!- ఒకానొకప్పు డొక ఫకీరు సుల్తానుదగ్గఱ కువచ్చి యొకప్పుడు- నీయాకారముగల మనుష్యుఁడు గనఁబడి నప్పుడు నీవు మరణింతు వని- జోస్యము చెప్పెను. నాఁటిరాత్రి నీవు పాయముగ- సుల్తాను వేషము వేసికొని యుండుము. సుల్తాను నేకాంతముగ నొకచోఁ జేర్పుభారము మాది. అప్పుడు నీవు కాన్పించినమాత్రమున నతఁడు తన జాతకము జ్ఞాపకము రాగా మంత్రమునకుఁ గిరలలేని పామువలె శక్తిహీనుఁ డగును. అప్పు డాతనిఁ జంపుట మహాసులభము-

వలీ—బలే! బలే!- ఇది మాకీ షాలా మహాయం!

చెకు—మరల దర్శనము చేసెదను. ఇదే మార్గము. నీవేష మతిచమత్కారముగ నుండవలెను. ఢిల్లీసుల్తాను చచ్చెనా ముస్తఫాను వధించుట క్షణము. నే నరిగెద.

వలీ—అచ్ఛా-అచ్ఛా- భాయీజీ! చాలాచాలామెహార్బా నీ వుంచు

(నిష్క్రమించును.)

చెకు—(పరిక్రమించి స్వగతము) అన్నలించిన వేళ్ళపులు లెక్కబెట్టు వలీఖాను తలక్రిందులైనాఁడు. వీని కిఁక నావాక్యము బ్రహ్మవాక్యము! అవల ముస్తఫావినాశమునకు మార్గాన్వేషణము చేయవలయును.

ఆ. భావిలినుగ ముస్తఫా వలీఖానులు
దాల్పబోయెను సులతాను వేష
ము లకు నొకరికొకరు మోసగింపగఁబడి
రొయరె నటకుకొందు లోకరినుకగు.

(అనుబంధము. 8.)

(నిష్క్రమించుదురు.)

(తెర వ్రాలును)



4 వ రంగము.

ముస్తఫా మందిరము.

[ముస్తఫాఖాను ప్రవేశించును]

ముస్త—(స్వగ) ఫాతిమా! ఫాతిమా!- మేరీ దిల్బరీ!

పట

హామారిజాన్ బచావో ఆవో - మేరీ దిల్బరీ.
హమారీ - మేరీ దిల్బరీ॥ హా॥
కొలిచి జరియా సేజాన్ - లూకరీ ప్యారీ
లూకరీ ॥హా॥

బారిబారి తెరిసూరత్ మేబల్ । ఫసంగదిస్తా
మేరీప్యారీ । చాంద కారాత్ మే । సింద్ నహీం
హై । ప్యారీ । సింద్ నహీంహై॥ హా॥

[చెరుము కి శాస్త్రి ప్రవేశము]

చెరు—సలాం ముస్తఫాఖాన్ సరదార్ సాహెబ్!

ముస్త—(మోహాసిద్రనుండి మేల్కొనిచూచి) శేషాల్ జోష్యులూ
ఖాయికీ సలాం! ఖాయ్! హెంతకాలాన్కి హాగ్బడ్డారు!

చెకు—ఇంతకాలమునకైన మీకు నేను కనఁబడుట నా అదృష్టమే -
మీకేమండీ! నవాబు సాహెబులు ! ఈ బోడిబాపడు మీ
కసలు జ్ఞాపకమొక్కటి యుండునా?

క. సుల్తానుదరిశనము మీ
కలయక చేయింతు మనుచు ననృతంబులు మీ
రలు పలికి మోసగించితి
రిలువేలుపుగా యబద్ధ మిల మలకలకుఁ.

ముస్త—భాఁయ్! అప్పుడు మేమంతా హన్షరం మీద వచ్చివున్నాఁము.
ఇప్పుడు మీకు దర్శనం చేపిస్తాం.

చెకు—ఇప్పుడు నాకు సుల్తానుదర్శన మేల?

ముస్త—మల్లీ- యిదీ యేంమాటా- షాస్త్రీజీ!

చెకు—ఈ సుల్తా నింకెన్నినాళ్లో యుండఁడని జోస్యమువలనఁ దెలిసి
కొని కాంబోలు సుల్తానుదగ్గఱకు వచ్చితిని.

ముస్త—కాబోయేసుల్తాను యెవ్రి?

చెకు—ఎవరోయైన నేను మీదగ్గఱ కేలవత్తును? జోస్యప్రకారముగా-

ఆ. భరతవర్ష మింకఁ బాలింపనున్నది
వర్షశతము ముస్తఫాలవంశ
మంతవఱకు నాకు సంతానమే వారి
మంత్రిపదవినుండు మహితరీతి

అందువలన నీసంగతి నంతయు జోస్యమువలనఁ దెలిసికొని- అదృష్ట
చక్రమిప్పుడు మన వంకకుఁ దిరుగుట గుఱుతించి- పురుష
ప్రయత్నము సేయ నిచ్చ దగ్గఱకువచ్చితిని.

ముస్త—(ఆనందముతో) జోష్యంలు భాఁయ్' మీది జోష్యం బెహ్మదే
మ్డూజోష్యం నట్టిస్తుంది- మీ మాటకి యెప్డూ తభావత్
జర్గదూ? మాకీ జోష్యం చెప్పండి.

చెకు—నన్ను నమ్మితివా చెడిపోవవు- నమ్మక- అతితెలివి చూపుచుంటో యుతివా- నీనాశనము నేనే సంకల్పించెదను. జోస్యము గీస్య ములకి తండులు కావలెను.

ముస్త—అమాటా హంతా హానష్టరం భాయీజీ! మిమ్మల్నీ పూర్ణం గా నమ్మియేసినాం.- మీారు గీసినగీత మాకీ బ్రిహ్మరాతా— జోష్యం చెప్పండి.

చెకు—గతము చెప్పెదను.

మ. కడకఁ వారసతీకటాక్షము నెదం గాంక్షించి ఢిల్లీపతిం
బుడమిం గూలఁగ నేసి తద్విభవముం బొందంగఁ గాంక్షించి నీ
వలకాబూలునవాబు సేనల సహాయార్థంబు రమ్మంచు జా
బెలమిఁ వ్రాయు వేఁయీాయుదంత మనృతం బేఁజోస్యమూాముస్తఫా!

ముస్త—(ఆశ్చర్యముతో) జోష్యులు భాయి! జోష్యంచేత హంతా నీల్ల ల్లో నీడలాగ కన్పెట్టియేసినార్—ఇంక మాకీ ముంకు జర్గ బోయే జోష్యం చెప్పండి

చెకు—ఒకానొకనాఁడు అనఁగా నేఁటి కిరువదిరోజులకు గోవానుండి కొందఱు వర్తకులువచ్చి ఢిల్లీసుల్తానునకు రత్నముల నమ్మెదరు వారి సరుకుల నన్నిటిం గనుగొనుటకై మిమ్ముల నందఱను సుల్తాను, యమునానదిలోని వర్తకులయోడలకుఁ గొనిపోవును. అచ్చట నీవు ఢిల్లీసుల్తానును వధించెదవు

ముస్త—ఢిల్లీసుల్తాన్కీ మేం చంపటాన్కీ మార్గం యేలాగ దొర్కు తుందీ భాయ్?

చెకు—పూర్వ మొక ఫకీరు ఢిల్లీసుల్తానుంజూచి సిరూపముగలవాఁడు కాన్పించునంతనే నీవు మరణింతువని జోస్యము చెప్పినాఁడు, ఆరాత్రి నీ వోడలోన, ఢిల్లీసుల్తానునకు వేషము వేసికొని సుల్తా నెదుట నిలుచుండినంతనే వాని కా ఫకీరుమాటలు జ్ఞప్తికివచ్చి

గడగడ వణకి సగము చచ్చును. నిముసములో నప్పుడు నీవు సుల్తానును వధింపఁగలవు. నీవేషముమాత్ర మచ్చముగ సుల్తాను ననుకరింపవలెను. వింటివా!

ముస్త—భాయి! మీదయచేత ఆలాగాచేస్తాం. మేం షుల్తాను ఐతే మీకీ దివాన్ చేస్తాం. ఆలాగా ఖరార్ కూడా యిప్పుడా చేస్తాం.

చెకు—ఖరారు లెందుకు? నీవు నన్ను నమ్మకున్నను నేను నిన్ను నమ్మెదను ఐనను నాజోస్యమే నేను ఢిల్లీదివాను నగుమనని చెప్పుచున్నది. నీవు చేయనక్కఱయే లేదు. ఇఁక నాకు సెలవు.

ముస్త—సలాం భాయ్! దయవుంచవాలా.

చెకు—అటులేకానిమ్ము. నేను నీకు మరల నోడపైఁ గాన్పించెదను. (పరిక్రమించి స్వగ) వలీముస్తఫా లొకరినొకరు సుల్తానునకొని యన్యోన్యము సుందోప సుందులవలె మరణింతురుగాక! ఇంత వఱకు సాలెపురుగల్లిన గూఁడు సిద్ధమైనది. ఇఁక వధావిధానము; పైయంకమునుండి విచిత్రనాటకము.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

ఇది చతుర్థాంకము.





# ప్రతాపరుద్రీయము.



## పంచమాంకము.



ఢిల్లీసుల్తాను దర్బారు.

[సుల్తాను, వలీఖాన్, ముస్తఫాఖాన్, కొందఱు వజీర్లు, పరివారము ప్రవేశము.]

సుల్తా — క్యాఖూబ్! వలీఖాన్ బహద్దర్! ఖుస్రోఖాన్ వరంగల్ లడాయీమే మర్గయాహై. ఆప్ బోల్ రహాహై ఉస్కా ఢిల్లీమే దేఖాహై జవాన్ లోక్ బోల్ రహాహై.

వలీ — సర్కార్! జవాన్ లోగోంకా బాత్ తమాంఝూట్ హై.

ముస్త — వలీఖాన్ తెలంగములుక్కేమర్గయా హుజూర్ మైభీదేఖ్ లియా!

సుల్తా — ఉస్కా ఔరత్ దరియాబీబీ దోమైనాసే పగ్లీహోగయా! రాత్ దిన్ హరోజ్ రోతీ — పుకార్తీ — థోడాదిన్మే — మర్జాయెగా భీ మై సంస్తాహుం.

అందఱు — తోబా — తోబా —

(విచారము సూచింతురు.)

[జవాను ప్రవేశము.]

జవా—తఫావద్ బాదబ్ దూర్కా ములుక్సే బడాబడా భకావ్ లోక్ బడాబడా నజర్ లాగర్ హుజూర్కా దర్శన్ కేలిఖే—దర్వాజామే ఖడ్ రహాహై.

సుల్తా—అచ్ఛా! ఆనే దేవ్.

(జవాను సలాముచేసి నిష్క్రమించును.)

[తరువాత వీరసెట్టి కొందఱు వర్తకులతో నజరులుగొనివచ్చి మోకాలిపై గూర్చుండి ఖుర్నీష్ సలాముచేయుచు సమీపింతురు.]

సుల్తా—(స్వగ) అరే! అరే! క్యా! అఫ్సోస్‌హై- అఫ్సోస్‌హై- ఏనజర్ దేఖ్‌కర్ మేరీ అంకీ అంధేరా హోగయా. (ప్రకా) కూర్చోండీ! సేట్ సాహెబులూ! కూర్చోండీ!

(వర్తకులు నజరులు ముందుంచి కూర్చుందురు)

సుల్తా—(నజరువస్తువుల నొకటొకటిగా బట్టిచూచుచు) మీరు యే కోప్తానుంచి వొస్తారు వర్తకులూ?

వీర—

క. గోవాపురి వాసము; యా
త్రావిధిఁ బ్రతివత్సరముఁ బ్రతాపన రేంద్ర
శ్రీవాస మగు నోరంగలు
సేవింతుము వర్తకంబుఁ జేసెదమిచ్చట౯.

ఆ పాపదైవ మిటు బ్రతాపనరేంద్రుని
నేర్చి స్వర్గమునకుఁ జేర్చుకతన,
రత్నములను గొనెడు రాజేంద్రుఁ డెక్కడ వేఱు
గానరాక నిటకుఁ గదలినాము.

సుల్తా—(జనాం) వలీఖాన్! వర్తకులూ రాజామర్గయా సెప్తార్! దేశం

అంతా అదే పుకార్! మన్మ రాజాకీతాజీంసేసి ఖైద్‌మే వుంచినాం.

వలీ—(జనాం) రాజా లడాయిలో పగ్బడకపోతే వాళ్యా అలాగా తల్సినార్.

సుల్తా—(జనాం) అచ్ఛా! అచ్ఛా! (ప్రకా) మరీ సేట్ సాహెబ్లూ—వారూ సచ్చిపోతే వారీ మంత్రీ యుగంధర్లవార్కీ మొందూ అమ్మలేదూ?

హరి—ఎక్కడి యుగంధరుఁడు? మీకు తెలియలేదు కాఁబోలును. ఆయన రామేశ్వరమున మరణించినారు. అందులకే యిట్లువచ్చితిమి!

గీ. ఏకశిలపతి దివమున కేగుపిదప
భరతవర్షంబునను రత్నవర్తకంబు
సలుప కొకనమస్కృతి సేయఁదలఁచియున్న
మాకు దైవంబు మిముఁజూపె మాన్యచరిత!

క. ఖాతాలన్నిల నీక మే
మీతావునకే మరల్ప నెంచితి మయ్యా!
బ్రాతిగ కొనఁగ నోసఁగఁగ
నేతటియవ నేసులే యహీనసమర్థుల్.

సుల్తా—అచ్ఛా! అచ్ఛా! సేట్‌జీ! అలాగైతే ప్రతిసంవత్సరం వోరంగోల్ రాజాకన్న, మొక్వాపామాన్లు మేముఖొంటాం. మీఖాతాలన్నీ మాకీ ఫిరాయించండీ! (నజరులలో నుండి యొకపచ్చలసామవిసి తీసి) చూడండి! వజీర్ సాహెబులూ! ఇదీ హంతా నఖ్కాపచ్చగాతోస్తూంది మాకీ—మరీ వజ్రం- కెంపు- నీలం పుష్యరాగం—పగడం—ఎలాగా పత్కినార్ తెల్వటం లేదూ!

వజీర్లు—మాకీకూడా చాలా హాశ్చర్యంగా వుంది!

వీరి —

ఆ. ఒక్కమరకతంబు నొసరమయూరాకృ
తిగ విచిత్రరీతిఁ దెలియఁబడని
యటుల రత్నచయము నదికిరి, తొమ్మిదేం
డ్లయ్యె నీనములఁ దయారుసేయ.

సుల్తా—బలే! బలే! ఎంతపనితనం- ఎంతపనితనం ! .

అందఱు—బలే! బలే! ఎంతపనితనం- ఎంతపనితనం!

సుల్తా—(మఱియొక పద్మమునుదీసి) ఇది పైన కెంపూ కింద పచ్చా తోస్తుంది- అతుకూ ఎక్కడ హాగ్బడడం లేదు.

అంద—హాశ్చర్యం- హాశ్చర్యం.

వీరి—

ఆ. ఒకటియైన కెంపు నొకపచ్చతోఁ జేర్చి
యతుకు తెలియరాని యట్లొనర్చి
మెళకువను సహస్రదళపద్మ మొనరింప
నిరువదేండ్లు పట్టె ధరణినాథ!

సుల్తా—అరే! అరే! బీస్ బరస్కా-కాం-ఎంతహాశ్చర్యం-(స్వ)మేమూ- షుఃభంగా, ఈటినీ, హాన్నింటినీ మింగియేస్తాం-(ప్రకా) సేట్ భాయ్! ఇలాగా వొక్టీవొక్టీ షూస్తే షాలాహాష్చర్యం అవుతూంది. మీమక్కల్ హాన్నీ యిక్డా తెప్పించండి- కొంటాం.

వీరి—జగత్ప్రభూ! అసాధ్యమగు కోరిక కోరితిరి.

ఉ. నావలలోన నింపుటకు నాలుగుమాసము లయ్యె మాకు నా
నావిధనూత్నవస్తువు లనంతము లున్నవి; మీవజీర్లతో
శ్రీవిభవంబు మీఱ దయచేసి మముం గృపఁజూచి, సర్వమున్
ధీవర! చిత్తగింప వినుతించెద మంజలిజేసి, భక్తితోన్.

సుల్తా—వజీర్సాహెబులాయిష్టం- మాయిష్టం.

వజీ—సుల్తాన్వారీ ఆజ్ఞాను మేం హమేషాం అనుసరిస్తాం.

సుల్తా—మాకీ యెల్లవాలా అస ప్రద్దేషం.

వజీ—మాకీకూడా అదేప్రద్ధేషం-

ముస్త—(స్వగ) భేతాళ్ జోష్యాలు జోష్యం హారంభం ఐంది.

వలీ—(స్వగ) మాకీ యిది యోగకాలం.

సుల్తా—సేట్ సాహెబ్లూ- మరీ యీనజర్ వస్తువుల్కీ- వెల సెప్పండి.

వర్త—రాజాస్థానములం దది లక్షణము కాదు. మీరే మీవద్దనున్న తెలిసినవారిచే వెలలు వేయింపుడు. అవి సరియైనచో మేము మాటాడము.

సుల్తా—వోరంగోల్ మే- మీరు యెలాగా వెలా తీరుస్తాహూ సెట్లూ?

వర్త—వరంగలునందు శ్రీప్రతాపరుద్రులవారే న్యాయముగా తీర్తురు. వారికి మేమెన్నఁడును నూరుమాటాడియుండలేము.

సుల్తా—(జనాంతికముగ) వలీఖాన్! ఇప్డూకూడా మనం ప్రతాపరుద్దర్ మహారాజ్ చేతా వెలయేయిద్దాం.

వలీ—(జనాంతికముగ) నాదీ ప్రద్దేషంకూడా అలాగా వుంటుంది.

సుల్తా—(జనాంతికముగ) మీరూ జవాన్కీ.పంపి వార్కీ- సౌదాగర్ యేసం యేయించి తెప్పించండి.

వలీ—(నిష్క్రమించును)

సుల్తా—అచ్ఛా! సేటుసాహెబ్లూ! మాదగ్గఱ వొకసౌదాగర్ చాలా తెల్వీగలవాఁడూ వున్నాఁడు. వానికీ పిలిపిస్తున్నాం.

వర్త—చిత్తము. మహాస్థానములో నెట్లు లేకుందురు!

వలీ—(ప్రవేశము)

సుల్తా—(స్వగ) హీటి వెలా అంతాసస్తాగా యేస్తే-నీకీవోరంఘోల్కా- యిడ్సి పెడ్తాం అని ఆసపెట్తే- రాజాకీ షమాధానంహోతుందీ!

[ప్రతాపరుద్రుడు సౌదాగర్ వేషమున ప్రవేశించును]

(సభలో నందఱు లేచి ఎదుర్కొని తెత్తురు)

సుల్తా—(రాజు చేయిపట్టుకొని) సలాం- సలాం- భాయీ- యిక్కడ- మాదగ్గఱ కూర్చోండి.

(అందఱు కూర్చుందురు)

సుల్తా—సౌదాగర్జాన్! ఈసేట్ సాహెబ్గారు మనఖాస్కే గోలా నుంచి యీరత్నవస్తువుల్ తెచ్చినార్! ఈటికీ వెలలూ వేయ టంకోసం తమర్నీ పిలిపించి చాలాశ్రమ తిప్పించినాం- వీటికి అన్నిటికీ- సరి ఐన వెలలు వేయించండి- (జనాంతికముగ) మీరూ- మస్తాగా వెలయేస్తే- వరంగోల్కు కైదిమన్సుల్నీ వదలీ యేస్తాం.

ప్రతా—(స్వగ) ఈనిర్భాగ్యున కీచింత ఆశ్చర్యమేమి? (జనాంతికముగ) సుల్తానువారి కృపచేత- ఈయన చేత మే మింక నిక్కడ నుండకుండ వెడలిపోవు భాగ్య మబ్బినది.

సుల్తా—అచ్ఛా! ఐతే చాలాసంతోషం! మరీ యీనజర్ సరుకులకీ వెల సరిగా యేస్తే వార్కేమసమాధానం ఔతుందీ చెప్తారు- ముందు అలాగా చేయండీ భాయీ!

ప్రతా—అట్లే చేయుదుము- (స్వగ) ఇతడు వీరిసెట్టి. ఈరత్నసరుకంతయు మా యంతఃపురము లోనిదే. నాతండ్రీ! యుగంధరామాత్యా! నాకొఱ కెంతకష్టపడుచుంటివి! (ప్రకా) ఏమండీ సౌదాగర్జీ! యీమాదిరి కొంటిరెంటికి వెలలు చెప్పిన చాలునా?

వీర—(స్వ) గడ్డముపెరిగి సంస్కారములేక ఎట్టిమహారాజున కెట్టి వేషమైనది? (ప్రకా) చాలును. వానికి మేము తృప్తులమైనచో మిగతపని యోడలలో చూచుకొందము.

ప్రితా——ఈపచ్చ నమలి-(లెక్కలు వేయుట నభినయించి) పచ్చఖరీదు రెండుకోట్లు- మిగత రాళ్ళు నలుబదిలక్షలు- మజూరీ యిరువది లక్షలు- మొత్తము దీనిఖరీదు రెండుకోట్ల అరువదిలక్షలు.

వీరి——మహాప్రభూ! ప్రితాపరుద్రమహారాజు తరువాత రత్నములకు వెలకట్టుటయం దింత నేర్పరిని మేమిదివరకు చూడలేదు. సరిగా నున్నవి

వలీ——(స్వగ) బలే! బలే!- బేతాల్ భాయీ బాగా లాలోచీ చేసినాడ్. కాకపోతే మహాల్వాలాకీ వెల యెలాగు తెలుస్తుంది?

వీరి——ఈపద్మపు వెలకూడ సరిగా నున్నచో మన మిక నోడల కరుగ వచ్చును.

ప్రితా——(త్రిప్పిచూచి లెక్కలు వేయుచు) పచ్చ రెండుకోట్లు- కెంపు రెండుకోట్లు- మజూరీ యేబదిలక్షలు- మొత్త మీపద్మపు వెల నాల్గుకోట్ల యేబదిలక్షలు.

వీరి——సుల్తానుగారూ! ఇం దేమియు భేదము లేదు. ఇక మన మోడల కరుగుదము.

సుల్తా——ఏం సౌదాగర్ భాయ్!

ప్రితా——తమచిత్తము

సుల్తా——ఇలాగే యెల్లిపోదాం- ఐతే లెండి.

(అందఱు లేతురు.)

[తెరలో]

"ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
ఇద్దో యిప్పుడె పట్టుకపోతాన్."

సుల్తా——(వలీఖానుతో) ఆదివా గాలాగ వుంటాను.

వలీ——చిత్తము.

సుల్తా——హంకూ పకడ్లే మోగా ఆగస్తా ఢగా

వలీ—వెఱ్ఱివాఁడు సర్కార్- మనవెంటా రావాలా వుద్దేశం వుం టాదు తోస్తుంది. వస్తున్నాఁడు.

సుల్తా—రానీండి; మాకీకూడా ఆశ్కీ సూడాలా వుద్దేశం- ఓడమీద యినోదం సేస్తాను. అక్కడిక్కికూడా రానీండి.

(అందఱు నడుతురు)

(తెర వ్రాలును.)

2 వ రంగము.

యమునా తీరము.

[సుల్తానుపరిభృత్యులు ఓడపై కెక్కుచుందురు. గట్టున వెఱ్ఱివాఁడు కేకలు వేయుచుండును ]

వెఱ్ఱి—తుఱకలకు పొద్దుపోకుండాపోతే నాకు తెల్లవారుతూంది. నీళ్లో యి- నీళ్ళు- యమునోయి యమున- ఎన్నినీళ్ళు- ఎంతనీలం- (పుక్కిలించి యుమియుటగా నటించి ఆచమనముచేసి) ఈపుల్లటి నీళ్ళలో మునిగితే- పుచ్చుకుక్కలై పుతతా- పిచ్చిముండా కొడుక్కంటే పుచ్చుకుక్కనయం- (మునుగుట నటించి స్నానముచేసి) *ఈబోసిపళ్ళ ముండాకొడుకు కింకా వెళ్ళిపో డెందుకూ? (సూర్యునిచూచి) పీణ్ణిశపించి తిట్టి అవతలికి పంపిస్తా- (ముఖము వికారముగాఁ బెట్టుచు లోన సంధ్యావందనమంత్రము జపించి) తిట్టినా వెళ్ళటంలేదు గనుక వీడిమీఁద నీళ్ళుపోస్తా- నిప్పులు పోస్తా- (నీళ్ళుపోయుటగా అర్ఘ్య మిచ్చుచున్నాఁడు) ఆఁ! వెళ్ళుతున్నాఁడు - వెళ్లుతున్నాఁడు. అదీదెబ్బ! వెఱ్ఱివాడిదెబ్బ! ఊరంతబొబ్బ! బాబో! బాబో! నీళ్ళు చెవుల్లోకి వెళతాయి

* బోసి పళ్ళముండాకొడుకు = వీరభద్రునివలన పళ్ళు రాలుటచేత సూర్యుఁడు

కా బోలాయి! చెవులు మూసుకుంటా- (చెవులుకట్టుకొని లోపలపరివర చదువుచున్నాడు).

(నీటిలో నీదుచు పడవలను పట్టుకొనును)

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
ఇదుగో యిప్పుడె పట్టుకపోతాన్
సూరణ్ణి పేర్ణి ఖూనీచేయిస్తాన్
ఇదుగో యిప్పుడె ఖూనీచేయిస్తాన్
గుండెల్ బద్దల్ చేసి గోరీకట్టిస్తాన్
ఇదుగో యిప్పుడె గోరీకట్టిస్తాన్
§కొబ్బరిబోండాలు కొట్టివేయిస్తాన్
దెబ్బతో యిప్పుడే కొట్టివేయిస్తాన్

(పడవచుక్కానులను పట్టుకొని వేలాడుచు నీళ్లు పుక్కిలించి పడవల మీద వారిపై నుమియుచున్నాడు. అందఱు రానీయక వెళ్ళగొట్టుచున్నారు)

వెఱ్ఱి—ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్
ఇదుగో యిప్పుడే పట్టుకపోతాన్.

ఇదుగో! నాసుల్తానోయి! నాముద్దుల- నాబంగారు- నా సింగారు- నాకంగారు- ఢిల్లీసుల్తానోయి! నిన్ను నేను నాయింటికి తీసుకుపోతూంటే చూడు వీళ్ళంతా రానివ్వరూ!

సుల్తా—అరే దివానా మహారాజ్ కూడా వచ్చినారూ! అరే పడ్వవాలూ! ఆయనిక్కా రానియ్యండీ! మాపడ్వలో నే ఎక్కించండి!

పడవవాడు—ఎక్కనయ్యా యెఱ్ఱోడా- మాపా నాలకి శెనిలాగ దాపరించావయ్యాల.

§ ఒక్కొకరి శిరస్సులే తరిగించెదను.

వెఱ్ఱి—నువ్వే బుద్ధిమంతుడవురా- ఎక్కుమన్న గుండుకే బుద్ధిలేదు.
(పడవ యెక్కును,)

"ఢిల్లిసుల్తాన్ పట్టుకపోతాన్"

పడవవాఁడు—సుల్తానుగారున్నారు. గందరగోళం సేయకయ్యా.

సుల్తా—వాడి దివానాబాత్ వింటే మాకీ ఖుషీ ఔతుంది. చెప్ప నియ్యండి- చెప్పనియ్యండి.

వెఱ్ఱి—(పడవవాఁనిని గుద్దురిమిచూచి) ఏమిరోయి మనిషీ మనిషి కడుపునబుట్టి మనిషెంతెగునావు- చస్తే మళ్ళీపుట్టవురానువ్వు- చావకముందు బతికున్నా- బతక్కముందు చచ్చేవున్నావు... .....పడవవాళ్ళోయి- పడవవాళ్ళోయి- పాడండిరా పాట చెపుతా.

పడవ—ఎందుకు బాబూ పాట- మాకీసావు సాలదనా?

సుల్తా—ఓరి పాడండిరా.

(వెఱ్ఱివాఁడు చెప్పఁగా పడవవాళ్లు పాడుదురు.)

పాట.

* ఆకొమ్మమీది పిట్టీకొమ్మమీదా
ఈకొమ్మమీది పిట్టాకొమ్మమీదా.

పడవ—ఆకొమ్మ........................

వెఱ్ఱి—† సింగాలుపొంగ సివ్వంగులూగూలంగ
పొంగేటి యమునలో బూతాలుమింగ॥

పడవ—సింగాలుపొంగ......................

* అక్కడి (ఓరుగంటిలోని) ప్రతాపరుద్రుఁడు ఢిల్లీలోనికి రాఁగా ఢిల్లీలోని సుల్తాను ఓరుగంటి కేగుచున్నాడు.

† యమునలో వలీ ముస్తఫాప్రభృతులు చావఁగా యుగంధరాదు లానందింపఁగా తురకల శవములను భూతములు తినును.

వెట్టి—‡పరశివుని కంటిలోపలనున్న పెనుమంట
కంటుగా పరశివుని కాల్చివేసిందా॥

పడవ—పరశివుని.......................

వెట్టి—§అలలున్నకడలిలో నగ్గిగుండము లేద
అలలనింకించి యావిరిగ జేసిందా॥

పడవ—అలలున్న ......................

పీరిశె—సుల్తానుగారు! ఇదేమి! ఈ యుపశకునపు పాట నాకు భయ
మగుచున్నది మాన్పింపుడు.

సుల్తా—(నవ్వి) అరే! సేట్‌జీఏందుక్ ఘాభ్రాహేతారూ! ఉత్తపాట
కీ-ఫికర్ పడ్తారూ! ఇనండి! దివానాక్లం యింటే మెంతఖుషీ
హోతుంది.

వెట్టి—"కోమటిపిటికీ- కొడితేప్రేకి" వాడితో మీకెందుకు మీరు
పాడండిరా.

1 పడవ—నాకుగూడా ఈపాట బయమేస్తుందాని మామా!

2 పడవ—ఇద్యాల మన గాసార మీలాగొచ్చిందిరా! ఏంచేతాం!
పాడు.

వెట్టి— పాట.

*ఎండ ఫెళ్ళునగాయ గాలిరివ్వనవీయ
నుంజేటిమంటలో మశకాలు మాడ

పడవ—ఎండ ఫెళ్ళున.......................

---

‡ ప్రతాపరుద్రుడు ఢిల్లీ చెఱలోనున్నను ఢిల్లీ కపాయము చేయలేదు.

§ యుగంధరుడు ఢిల్లీలోనున్నను ఢిల్లీ కపాయముచేయలేడు.

* ప్రతాపరుద్రుడు వెలుగుచుండ చెకుమికి సహాయముగనుండ యుగంధరుని
తంత్రమున తురకలు కాలుచున్నారు.

వెట్టి—*ఒక్కొక్క తురకాయ చక్కగా చెక్కేసి
తొయ్యరా గుండాన కుయ్యిమనకుండా॥

పడ—ఒక్కొక్క.............................

వెట్టి—§ఒంటిగా హనుమంతు డింటింటో దూరితే
లంకలో వారి కారాక తెలిసిందా॥

పడ—ఒంటిగా....................

వెట్టి—†గుండుగుండెగరగా, గుండాన కూలగా
గుండుగుండుకు నొక్క గుండు వేయంగా॥

పడ—గుండుగుండె.

వెట్టి—ఆచెట్టుమీదిపి ట్టీచెట్టుమీదా
ఈచెట్టుమీదిపి ట్టాచెట్టుమీదా॥

పడవ—ఆచెట్టు......................

వీరి—సుల్తానుగారూ! ఈవినోద మింక చాలును. మనము లోనికి
పోవుదమని ప్రార్థించెదను?

సుల్తా—ఏమంటారు వజీర్లూ-సౌదాగర్భాయ్.

వజీ—తమ మెల్వుకూ షూస్తున్నాం.

సుల్తా—ఐతే- అచ్ఛా! రండీ యెల్దాం!

(అందఱు లోపలకు నడతురు.)



* ఒక్కొక తురకతలనే కొట్టి నదిలోత్రోయుమని సూచన.

§ యుగంధరుని ఢిల్లీపురప్రవేశమును తురకలు గ్రహింపలేకపోయిరి.

† ఒక్కొక తురకగుండు నెగురవైచి యమునలో త్రోసినప్పుడెల్ల నొక్కొక తుపాకిగుండు వేయవలసినదని సూచన.

4 వ రంగము.

ఓడ లోపలి భాగము.

[సుల్తాను, వజీరు, ముస్తఫా, పరీలు, ప్రేక్షకులు, వీరిసెట్టి మొదలగు నాగరికులు ]

సుల్తా—(అంతటను కలయజూచి) సౌదాగర్ సాహెబ్లూ! ఇది ఓడ కాదు- పరిస్తాన్ అని మేము తలుస్తాం. జల్మంపెట్టినతర్వాత నేం యిలాగంటి చోటుకల్ చూచింది లేదు. ఈచమక్ తినిని. మాకన్ను ఆనందంలో మున్గి మూసుకొనిపోతుంది. హింకా-హింకా-మీరత్నం మహుల్ చూచి మరీ యేమౌతుంది మాకూ తెల్వటం లేదు.

వీరి—ప్రభువులవారిప్పటికి చూచినది స్వల్పమాత్రము. ఇంకను చూడవలసినది యున్నది. ఇది తమరు కచేరిచేయుటకై యేర్పరుపబడిన యంగణము.

సుల్తా—సౌదాగర్సాయిబాలూ! మాకీ హామేషా ఖచేరీచేస్తాం మల్లీ యిక్కడ ఖచేరీ యెందుకు పెట్టినారు?

వీరి—మహాప్రభూ! ఇది తమ ఖచేరికాదు. ఇది పాటకచేరి.

సుల్తా—అచ్ఛా- అచ్ఛా- ఆలాగ ఐతే మాకీ చాలా ఆనందం. ఏమి వజీర్ సాహెబ్లూ!

వజీ—మాకీకూడా పాటకచేరీ మీదాఖుషీ.

వీరి—ప్రభువులవారు దయచేసి కూర్చుండవలసినది. (?)

(అందఱు కూర్చుండురు.)

సుల్తా—మొదటా మహుల్ చూచీ తర్వాత కచేరీ చేస్తాం.

వీరి—పాటకచేరిలోనే మీకు సరుకులు చూపించెదను.

సుల్తా—అచ్ఛా! అచ్ఛా!

వీరి—తమకు తెలుగుపాట యిష్టమా? హిందూస్తానీపాట యిష్టమా?

సుల్తా—మేం హరోజ్ హిందూస్తానీ పాటా ఝుంటో వుంటాం! ఇప్పు డూ తేటతెలంగీ ఖానా యిప్పించండీ సేట్‌జీ!

(సేవకులు గుడుగుడు తెచ్చియుంతురు. ఖానులు పీల్చుచుకూర్చుందురు)

వీరి—పెద్దిసెట్టీ! గానసభ ప్రారంభము చేయింపుము.

[వేశ్యలు, మార్దంగికుడు, తిత్తివాడు ప్రవేశము.]

వేశ్య—(అందఱికి సలాములు చేయుదురు)

సుల్తా—క్యా తెలంగీ సౌదాగర్లూ! మాకీ ఫరీలమధ్య యిడ్సిపేసి వార్.

వీరి—మహాప్రభూ! ఇవి ఫరీలుకావు. యంత్రపుబొమ్మలు. ఇవి తమరు చిత్తగించవలసిన సరుకులలోనివే! ఇవి ఆడఁగలవు; పాడఁగలవు.

అందఱు—హాష్చర్యం- హాష్చర్యం!

సుల్తా—సౌదాగర్భాయిలూ! ఖుదాహ వ్వాఁతిఁ ప్రాణంకూడా యిాట్కీ పోసినారా ఫ్ఁస్తుంది.

వీరి—మహాప్రభూ! ప్రాణము పోయఁగలమా? ఇవి యంత్రసహాయ మున తిరుగుచున్నవి. యంత్రమును నిలిపివేసిన నివి నిలిచిపో వును. చిత్తగింపుఁడు.

(యంత్రమును నిలుపును.)

(వేశ్యలుమొదలగువారు బొమ్మలవలె కదల మెదలక నిలతురు)

సుల్తా—చాలా అష్హాన్ అవ్పతూందీ సేట్‌భాయిూలూ! ఇవి బొమ్మల్-ఖేల్ బొమ్మల్-బలే-బలే-(వానిని చేతులు కాళ్లు కదిలించి ఆనం దించును) చూడండీ! వజీర్ సాహెబ్లూ హెంతాచిత్రం.

[వెట్టివాఁడు ప్రవేశించును.]

వెట్టి—ఎంతచిత్రం ఎంతచిత్రం-కళ్ళులేనివాడికి కంటిపాపలో కైలాసం! (వీరిసెట్టిని చూచి) నాకేదిగా తివాసీ- నాకేదిగా తివాసీ! (చెవికట్టుకొనును.)

వీరి—సుల్తానుగారూ! ఇదేమిబాధ నాకు? వీనిని వెళ్ళమనిచెప్పండి!

సుల్తా—సేట్‌జీ గాబా్రి! సేట్జీ గాబా్రి! (నవ్వుచు) ఏమి నాకుతారు దివానాసర్కార్!

వెట్టి—(పీరిసెట్టి చెవివదలి) ఏమి నాకుతారూ? కళ్లు లేనివాళ్ళు కళ్లున్న వాళ్ళ చంకనాకుతారు! ఎవళ్లూ రానివ్వకుంటే నేను నాసుల్తాను దెగ్గరే కూచుంట.—

సుల్తా—రండీ- రండీ- ఇలాగారండీ దివానా సర్కార్! నాదగ్గరగా కూర్చోండి (కోటిచ్చును)

వెట్టి—అమ్మనాయినోయి! బోగమాళ్లోయి-బోగిమ ళ్లోయి! బోగమా టో్రయి-బోగమాటో్రయి!

సుల్తా—(నవ్వుచు) గొమ్మున్సి సూసీ భోగంవాన్యా అన్కుంటే నా దివానాసర్కార్!

వెట్టి—నేను దివానానా? నువ్వే దివానా!

సుల్తా—(నవ్వుచు) అచ్ఛా! అచ్ఛా! నేనే దివానా!

పీరి—(భయముతో) సుల్తానుగారూ! ఇదేమి గందరగోళము! మేజు వాణీ చేయింతుమా మానుకుమా!

సుల్తా—దివానాసర్కార్ గోల్‌మాల్ చేయుంచి! గానాబజానా జరుగుతుంది.

వెట్టి—నాసుల్తాను మాటంటు నేను దాటను. నోరుమూసుకుని కూచుంటా! నన్ను మాట్లాడించినవాళ్ళకు మణాస్!

(నోరుమూసుకొనును)

(వేశ్యలు పాడుచు ఆడుచున్నారు)

పాట.

"మె రీజానీకాకానూ మేకు త్రేగాహై రెసాచి మోతియా"

సారంగ్—తిశ్రగతి.

పర! మానంద! మైత్రోచె! నీముఖారవిందము బొడగాంచగా

నినుఁ బొడఁగాంచగా। నీసొరు నొంచగా॥ వ॥
వెన్నెలరాతిరీ। నిన్నుదలంచితీ। ఘన మోహపారావారము
ననుమునిగి। కనులు గానవైతిరా॥ వ॥

అందఱు—వహ్వా వహ్వా! (ఆనందించుచున్నారు)

శెట్టి—హావహ్వా! హావహ్వా!-వీళ్ళంతా వహావ్వా అనటమేమిటా?
(వేశ్యలు నిష్క్రమింతురు.)

వీరి—(వినయముతో) జగత్ప్రభువువారికి విందు తయారైనది. విందు
భోజనము లయినపిదప మరల నొకింత వినోదగోష్టి చేయుదము.

సుల్తా—అలాగా ఐతే ఈరాత్రి అంతాం మేం యిక్కడే వుంటాం- యేం
మిటీ సౌదాగర్లూ?

వీరి—ప్రభువువా రెక్కడనున్న లోపమేమి?

సుల్తా—అచ్ఛా! అచ్ఛా! వజీర్సాహేబ్లూ! సౌదాగర్లా హాభిప్రా
యం యిలాగావుంది. మీరేమి సెప్తార్?

వజీ—హామేషాప్రభువులా హాభిప్రాయం మాహాభిప్రాయం ఒక్కటే
వుంటుంది.

సుల్తా—(ప్రతాపరుద్రునిఁ జూచి) ఏం సౌదాగర్భాయీ! తమరు
కూడా కొంచెంపులావ్—

ప్రతా—క్షమించవలెను. జాతిభేదమును మీరెఱుంగరా! మీవిందు
భోజనము లగులోపల సరుకులకు నేను వెలలువేసి మీపని
పూర్తిచేసెదను.

సుల్తా—(విచారమునటించి) మరీ యేంచేస్తాం- నసీబ్ అలాగావుంది.

(వజీర్లు-సుల్తాను-వీరిశెట్టి నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును)

5 వ రంగము.

ఓడ పై భాగము.

[చెకుముకిశాస్త్రి ప్రవేశము.]

చెకు—(స్వగతము) తురకలు భోజనముల కరిగినారు. ఇఁక నోడలంగ రుల నత్తించవచ్చును.

చ. తరుణము వచ్చె నీతురకదండుల గుండెలు దీయ; శాంతిభీ
కరఘనతంత్రజాలములు కాకతినాథుని వీడి యూవనే
శ్వరకరయుగ్మముం దవిలె, సారయుగంధరసీతిభూరుహం
బిరవుగ సత్ఫలంబు గనె; నింక భుజించెద రాంధ్రభూజనుల్.

వలీము స్తఫాల మరణంబులతోడ- నీమహాతంత్రనాటకమునం దొక్క యంకము ముగులును.

సీ. పంచఖండములలోపల నాంధ్రదేశమే
విస్తారవైభవోపేత మనుచు
నిఖిలప్రపంచైకనీతిశాలురయందు
నాంధ్రులచేయి పై పందె మనుచు
నఖిలసాగరముద్రితానంతమండిత
విశ్వమం దాంధ్రులే వీరు లంచుఁ
బరరాజనిర్మితాపారతంత్రచ్ఛేద
రతి నాంధ్రులే మహాచతురు లంచుఁ
దగనుతించి సత్ప్రతాపరుద్రీయ, యు
గంధరీయ నాటకములు వ్రాసి,
నాట్యగతి బ్రదర్శనము సేయ నాచంద్ర
మైన కీర్తి గాంచు నాంధ్రమాత.

ఇంక నైదునిముసములలో నితరసర్దారుల తలలు—పదినిముసములలో వలీముస్తఫాలవధలు—చేతులు కడుగుకొనవచ్చును.

[తెరలో]

సలాం- జమ్నామాయీ- తేరీకు సలాం జమ్నామాయీ-
మైమ_ర్తీహూం- మైమ_ర్తీహూం.

[మరల తెరలో పెద్దచప్పుడు]

చెరు—ఓరీ పడవవాండ్రు! అదేమో చూచిరండు!

పడవ—(ప్రవేశించి చూచి) బాబూ! తురకబూబు కేకవేస్తావొచ్చే
ట్లోబడి తనుకలాడతావుంది- సస్తాదేమో!

చెరు—(స్వగతము) ఖుస్రూఖానువధను గాంచి యున్మత్తయైపోయిన
తత్పతి దరియాబీబీగాఁ దోఁచుచున్నది. కానిమ్ము. ఇప్పు డిదియు
నొకసాధనము. జాగ్రత్తపఱచెదనుగాక! (ప్రకాశముగ) ఓరీ!
పాప మెవ్వరో దీనురాలు నీటిలోఁ బడినది. జాగ్రత్తపఱచియుం
చుఁడు- నేను వచ్చుచున్నాను.

(పడవవాఁడు నిష్క్రమించును.)

చెరు—ఇంకసుల్తాను వేషములను సిద్ధము చేయవలసియున్నది.

[వలీఖాను ప్రవేశించును.]

వలీ—భేతాళ్ జోష్వలుభాయ్! నాకీ గాభ్రాగా వుంది. యేమీ
తోసటం లేదు.

చెరు—నీకిప్పుడు గాబరా యేమివచ్చినది. ఈప్రక్కగదిలోఁ గూరు
చుండి నీవేషమును సిద్ధముచేసికొనుము. నీవార్తను సుల్తా
నడుగనే అడుగఁడు. అడిగినచో సరుకులగదిలో నున్నవాఁడని
బొంకెదము. ఇంక నాలస్య మేల చేసెదవు?

వలీ—అచ్ఛా! అలాగాచేస్తాం-(నిష్క్రమించును.)

చెరు—(స్వగతము) వీఁడు తన చావువేషమును వేసికొనుట కరుగు
చున్నాఁడు.

[ముస్తఫాఖాను ప్రవేశము]

ముస్త—(ఆనందముతో) బలీ! బలీ! మాక్కీ జోష్వాలు భాయి ధర్షనం చాలా సదుపాయం- మేం యింకా యేసంయేస్కుంటాం భాయీజీ!

చెరు—ఇంకను నీవిటులె యుంటివా! సుల్తాను మంచి కైపులోనున్నాఁడు. వధించుట కిది మంచిసమయము వెళ్ళుము.

ముస్త—యేసం యేయటం రెండు నిమ్సంల్లూ! (నిష్క్రమించును)

చెరు—ఆ సురను ద్రావియున్న సుల్తాను శోకచిత్ర
రూపకంబు నిపుడు జూపవలయు,
యవనవీరహరణ మగు నావిషాదాంత
రూపకంబె మాకు నేపు గూర్చు.

(నిష్క్రమించును.)

6వ రంగము.

ఓడలోని యంతర్భాగము

[సుల్తాను, వజీర్లు, కైపులో నుందురు.]

సుల్తా—(కైపులో) వజీర్ సాహెబ్లూ! మనమూ- ఈసర్కాల్ హాన్నీ కొంటాం- మనం ఖేల్ బొమ్మల్ సే ఆటాఆడిస్తాం- పాటా పాడిస్తాంకూడా—

1 వజీరు—మేము స్వాయంగా- ఆబొమ్మయెంటా తిర్గీతిర్గీ ఆడ్తాం-స్వాయం పాడ్తాంకూడా—

2 వజీరు—మేము థోలక్ మెడామే తగ్లించుకొని పాటాపాడీ డోలక్ వాయింపిస్తాం.

సుల్తా—అదీయెలాగా వాయింపిస్తారు మీరు వజీర్జీ!

2 వజీ—హావహ్వాం మస్వీ చేస్కుంటాం.

పాట

హాకీతోటీ మేమూ హోంగాడ్తాం
హాకీ ఖంట్లంతో పాటాపాడ్తాం
హాకీ పాదాల్కాడ ఘూకుంటాం
హారీ మొగమ్మీద సూస్తూంటాం॥ హా॥

(తనపృష్ఠమున తాళము వాయించుచు నొకసారి తిరిగి మరల కూర్చుండును.)

అందఱు—వహ్వా! వహ్వా! వజీర్ సాహెబ్ గానా సేస్తాడూ నాచీ సేస్తాడూ.

(నవ్వుదురు.)

సుల్తా—తమూరి తెలంగీ ఘానా యెప్పుడూ నేర్చింపినారూ వజీర్సాహెబ్ !

2 వజీ—సర్కార్! మేం ముందూజన్మంలో సచ్చినప్పుడూ వచ్చినాం. అప్పుడు దీన్నిరచ్చినాం- అందులో మెచ్చినాం- కాకపోతే తెచ్చినాం- అదీకాకపోతే- లచ్చినాం- మేం అంతా అఢ్ఢేనాం-

సుల్తా—భాయ్‌జీ! అందీక మీకీ యిదీ యినాం.

(సురారస మిచ్చును.)

2 వజీ—సనాం- సనాం. (త్రాగును.)

సుల్తా—క్యాజీ వలీఖాన్ సాహెబ్! (అటు నిటుఁజూచి) వలీఖాన్ సాహెబ్లూ! హేక్డా మచ్చీనార్.

(వీరిసెట్టి ప్రవేశము.)

వీరి—సర్కార్! వారును, ముస్తఫాగారును కలసి, మీసౌదాగరు తోడ సరుకులు లెక్కించుచున్నారు.

సుల్తా—వారూకూడ కైపేమే ఎందుకూ లేరూ?

వీరి—ఉన్నారు.

సుల్తా—అలాగైతే మాకీ పాలా సంతోషం.

(పోలుచున్నాడు)

పీరి—(స్వగ) పీ రెక్కడనున్నారో పీరికి తెలియుదు. వాయువేగమున నోడ తెరచాప లెత్తుకొని యతిరయమున నరుగుచున్నది

[తెర చింపుకొని వికృతాకారముతో తడసిన బట్టలతో దరియాబీబీ ప్రవేశము.]

దరి—(కటారిపట్టుకొని) బతావ్! వలీఖాన్క్యా బతావ్! మైమారుంగా- ఉన్కామారుంగా- ఆధాంగాత్ మే మేరీ మరద్క్యా ఖుస్రోఖాన్క్యా చోమార్గియా ఖూనీకియా!—బతావ్!—(సుల్తాను పైకరిగి) క్యారే! సుల్తాన్! అంధాసుల్తాన్! ముఝ్క్యా బతావ్! తేరా వలీ ఖుస్రోఖాన్క్యా బతావ్! ఓచోర్ హాంతక్ కహాంగయా!

అందఱు—(భీతిల్లుచురు)

సుల్తా—(భయముతో) ఖుస్రోఖాన్క్యా చోరీ దరియాబీబీహై- ఏ దివానీహై- సౌదాగర్ సాహెబ్‌లూ సౌదాగర్ సాహెబ్‌లూ క్యాహువా? ఎంతమోసం ఎంతమోసం- ఈపగిలీ నన్ను నంపియేస్తుంది- రండి- రండి.

పీరి—(దరియాను పట్టుకొనును.)

దరి—(ఉన్మాదావేశముతో) వలీఖాను చోర్‌హై- హాంతక్‌హై- మేరీజాన్ నికల్ దియాహై- ఖుస్రోకూఖూనీకియాహై.

(మూర్ఛిల్లును)

సుల్తా—ఇదియేమిటీ సౌదాగర్లూ! మాకీ నిషా దిగిపోయింది! గాభ్రా యేస్తూంది! మేముబత్కీవున్నాం లేక, సచ్చీవున్నాం- చెప్పండి.

పీరి—జగత్ప్రభూ! ఈమె- యమునానదిలో బడిమునిగిపోవనుండ కళాసులు తీసి రక్షించినారు. అంతకన్న మే మేమియు నెఱుంగము.

సుల్తా—సౌదాగర్భాయీ! ఇదిమా ఖుస్రూఖాఁ కా ఔరత్- ఖుస్రూఖాన్కూ మేం కొడుక్కూ మమానం పెంచుకున్నాం- ఆడ్కీ వలీఖాఁ ఖూనీచేసినాడూ రోదన్ చేస్తుందీ! మాకీ వొక్టీమాలుం కావటంలేదూ.

పీరి—అట్లయిన మావద్ద నొకజోస్యుఁడు కలఁడు. అతఁడంతయు నెఱిఁగింపఁగలఁడు. భేతాళజోస్యులుగారూ!

(చెకుముకిశాస్త్రి ప్రవేశము)

చెకు—సుల్తానువారికి సలాము.

సుల్తా—బేతాళ్ జోస్యుల్వారూ! ఖుస్రూఖాన్ సంగతీ మాకీ సెప్పి రచ్చింపండీ!

చెకు—(ఆలోచించి) జోస్యప్రకారముగా చూడ, మాకీవిషయములు గోచరించుచున్నవి.

సీ. తొలుత ప్రతాపరుద్రుఁడని మీఖుస్రూ
భ్రమ నంది చాకలిన్ బట్టినాఁడు;

సుల్తా—అరే! అరే! ఎంతమోసం సేదినాడ్ వలీఖాన్! మసాల్చీ వాడ్కీ మాచేత తాజీం చెప్పి హవ్మానం చేసినాడ్!

చెకు—

సీ. సుల్తానుతోడ ఖుస్రూఖాను వదియింతు
ననిన వానిని హతమార్చినాఁడు;

సుల్తా—హాతే! హల్లా! ఎంతఘోరం- ఎంతఘోరం- వాకీ కొడుక్కూలాగా వున్నఖుస్రూఖాన్కీ యీపాపీ తన ఫేట్మే పెట్టుకున్నాడు. ఖుస్రూఖాన్!- ఖుస్రూఖాఁ!- మేరాబేటా- మర్గయా- మర్గయా—

(ఏడ్చుచున్నాఁడు)

చెరు—

సీ. ఈయోడలోనసే మీయాయువులు దీసి
తఖ్తు నెక్కఁగ వలీ తలఁచినాఁడు;

సుల్తా—హారే! హారే! మాదీ నమ్మఖ్ తిని మాకీ ఖూనీసేసి మాదీ తఖ్తా యీడూ యెఖ్తాడు. వలీఖాన్ - వలీఖాన్ - పాపీ! చండాల్! నీకి కోసి కాకీ కేసినా పాపం లేదురా!

చెరు—ఇంకను చిత్తగింపుఁడు.

సీ. ఇది యిటులుండ, మాయికుఁడైన ముస్తఫా
యీరేయి మిముఁ జంప నెంచినాఁడు;

సుల్తా—అరే! అరే! మాకీ ముస్తఫాకూడా ఖూనీ చేయటాన్కి వుద్దే మందీరాదా వుంటాడు. మేం ఖద్దా మేవున్న హాంగార్ తెల్సుకో లేకపోయినాం మాదీ అంధావర్బార్ అయీపోయిందీ!

చెరు—.

గీ. మీరు నీదినంబు మితిలేని గండముల్
గలవు వానినెల్లఁ గడచుకొన్నఁ
గాని దూరదేశగమనంబుగల్గు మీ
ప్రాణములకు లేదపాయ మొందు.

సుల్తా—(కోపముతో) అరే! అరే! అరే! వలీ ముస్తఫాఖాన్లా మాదీ జాన్ తీసి- మాదీతఖ్తా యెక్తాహూ! నమ్మక్ హారాం! నమ్మక్ హారాం ఆళ్ళాఫీకల్ కోసీ పాకాపాన్కి యేస్తాం. ఆళ్ళకి హాంగ్లా గ్లే పోర్లించీ- పొర్లించీ పెట్ పెట్ పెట్ పెట్ ఖబాబుల్ ఖాలుస్తాం. మేరా బేటా ఖుసూ్రిఖాన్! ఖుసూ్రిఖాన్! దిక్కు- లేక- మొక్కు- లేక- వలీఖాన్ నిన్ను సంపేయేసినాడ్! అడ్కి- మోహం తిని నీకీ మేము గరీబ్ షేచినాం.

చెరు—శాంతింపవలెను- మీసరదార్ల మోసముల కివే నిదర్శనములు

చూడుఁడు. నేను ఢిల్లీసుల్తాను నైనచో నిన్ను వరంగల్ రాజును చేయుదునని మీవలీఖా నవ్వానికో వ్రాసియిచ్చినాఁడు. ఇది యొకలేఖ- వ్రాత వానిదే కదా చూడుఁడు! నేను ఢిల్లీసుల్తాను నైనచో- నిన్ను రాణిం జేసెద నని మీముస్తఫా వ్రాసియిచ్చి నాఁడిదియొకలేఖ- వ్రాత సరిచూచుకొనుఁడు సరిపోయినదా! ఢిల్లీ పైకి దాడి రమ్మని కాబూలుసుల్తానునకు మీముస్తఫా ఖాను వ్రాసిన దిది యింకొక లేఖ— వ్రాత యాతనిదే కదా చూడుఁడు.

సుల్తా— హంతా షరీపోయింది- హంతా బగాబర్ వుంది- మేం హంధా ఐపోయినాం- మా ప్రాణం గడడడలాడుతుంది.

చెకు— ఇవి మా జోస్యముచేఁ దెప్పించితిని. మీ ప్రాణాపాయము నెఱింగియే యీసౌదాగర్లు మి మ్మీయోడలోఁ జేర్చినారు.

సుల్తా— అరే హల్లా! యాఖుదా- పర్వర్దిగార్ మాదీష్వాజనం మా ప్రాణంతీయడాన్కి- షిద్ధం అవినార్ పరజనం మాకీ రచ్చించటాన్కి- షిద్ధంఅవినార్.

చెకు— నా కింక సెలవు దయచేయింపుఁడు.

(నిష్క్రమించును.)

[తెరలో]

మేరా బాబా! ఢిల్లీసుల్తాన్! ఢిల్లీసుల్తాన్ - అర్ధరాత్రీకాడా- వలీ ఖాన్ నన్ను నర్కి-యేషినాడ్ మేరా దాదా— పాపీ ఛండాల్ ఖూనీచేసినాడ్ దాదా.

సుల్తా— (భయముతో) హారే! హారే! మాదీ చెవ్రుల్కి ఖుస్రూఖాన్ రోదన్ యిన్పడ్తుందీ! మేం వచ్చిపోయినాం సౌదాగర్ భాయ్!

వీరి— కొన్ని నాళ్ళ క్రిందట మేమోడలకు లంగర్లు వేయుచుండఁగా— మాపరిజనమునకు నీటిలో నొకమనుష్య కళేబరము దొరికినది.

తీరమున నక్కలను గుఱుతించి త్రవ్వించూడగా నొకశవము శిరస్సు దొరికినది. రొటిసుకుగా నరిపోయినది. దానిని తైలమున నుంచి కొన్నినాళ్ళు చెడకుండగా కాపాడితిమి కొన్ని నాళ్ళ కావచ్చినవాని ప్రాణము పిశాచమై యాశవము నావేశించి- గదిలో "కో" యని కేకలు, ఏడ్పులు, నట్టహాసములు బయలుదేరినవి. వానిని విని మా స్వజనమున ననేకులు జ్వరబాధ నందసాగినారు. ఇవి యాపిశాచపు కేకలే మహాప్రభూ!

సుల్తా—(శోకించుచు) మేరా బేటా ఖుస్రూఖాఁ షైతాఁ అవినాడ్- ఇది యింటే మాకీ ఘుండెల్ బేజార్ అయిపోతూంది.

[చెకుముకిశాస్త్రి ఖుస్రూకళేబరమున దూరి పిశాచాకృతితో ప్రవేశించును.]

ఖుస్రూ—మేరాదాదా! వలీఖాఁ మహాల్చీకీ కట్టీ రాజా హానీ మీకీ నమ్మకం సేయించినాడ్! మీకీ యిదీ షైతాఁ తల్సీ- నేను నీంద్ సేసెలిప్పుడూ ఖూనీ సేసివాడ్ మేరా దాదా- గరీబ్ జాఁ- దిక్కులేసీ సావూ సచ్చిందీ! అడ్కీ నంపితే నా ప్రాణం సంతోసం ఔతుందీ- నేను యెల్లిపోతాఁ- మేరా దాదా- నీకీ యిదీ సెప్పతానీకి షైతాఁలాగా వున్నాఁ- మేరా దాదా—

(శవశరీరము నేలఁగూలును. చెకుముకి యితరుల కంటఁబడకుండ పాఱిపోవును.)

సుల్తా—(ఏడ్చుచు) బేటా! బేటా! ఖుస్రూఖాఁ- తేరీజాన్ నికల్‌గయా! మేరీజాన్ నికల్‌గయా!-

(దరియాబీబీ వికృతాకారముతో లేచి)

దరి—ఖుస్రూఖాన్- ఖుస్రూఖాన్! తేరీజాన్ నికల్‌గయా! మేరీజాన్ నికల్‌గయా!—(అటుఁటు తీవ్రముగఁజూచి) ముర్ఖూ—

బతావో! ముర్ఘుఖా-బతావో- వలీఖాఀ కిదర్ హై- వలీ ఖాఀ కిదర్ హై- (ఖుస్రూ కళేబరమును చూచి దానిపైఁబడి శోకించుచు) మేరాఖుస్రూ! మేరాఖుస్రూ! మేరీజాన్!—
(నవ్వుచు) హా హ్హా హ్హా హ్హా హ్హా! తూ ముర్ఘుఖా-ఛోడ్కర్ ఇధర్ సోగయా! జమీన్ పర్ సోగయా! మైభి సోతాహుం-తేరాసాత్ మైభీసోతాహుం—

(పొడుచుకొని భూమిపైఁ బడుచున్నది.)

సుల్తా—(కన్నులు మూసికొని, కంపించుచు) హా! ఖుదా! దర్యాబీ మర్గయా! మై కైసాదేఖుం? మైఁబీ మర్జావుంగా!—

(పొడుచుకొనఁబోవును.)

పీరి—(పట్టుకొని) సుల్తానువారు సాహసము చేయఁగూడదు. వలీము స్తఫా వధావిచిత్రరంగము సయితము దర్శింపవలయును. రండు. చూచెదము.

సుల్తా—సౌదాగర్భాయ్! మేం యింకా బ్రదికి యేంప్రయోజనం?- ఈప్రాణాలు రెండు మాకళ్ళయెదుట- సచ్చిపోయినవి- ఖుస్రూ ఖాన్కి- ము స్తఫాఖాన్కి మంపటాన్కి మూషరీరంలో తాఖత్ హంతా సచ్చిపోయిందీ! మేంకూడా షచ్చీపోతాం- మాకీ హటంకం చెప్పవద్దు!—

(మరల పొడుచుకొనఁబోవును.)

పీరి—(పట్టుకొని) వలీము స్తఫాలను మీరు చంపనక్కఱలేదు. మా జోస్యులమాయచేత వా రొకరి నొకరు పొడుచుకొని చావ నున్నారు. రండు! ఆచిత్రమును చూచెదము.

సుల్తా—మాదిల్ గాభ్రా ఐపోయిందీ! సౌదాగర్భాయ్! నడ్వటాన్కి కూడా ష క్తిలేదు.

పీరి—నేను మీచేతిని పట్టుకొందును. జాగ్రత్తగా నడచిరండు.

సుల్తా—ఐతే నడవండి.

(వీరిశెట్టిచేతి నూతఁగాఁగొని సుల్తాను నడుచుచున్నాఁడు)

(తెర వ్రాలును.)

7 వ రంగము.

[సుల్తాను వేషముతో ముస్తఫాఖాను కూర్చుండియుండును.]

చెకు—(ప్రవేశించి) జాగరూకుఁడవై యుండుము. సుల్తా నీమందిరము నకు వచ్చుచున్నాఁడు.

ఆ. నిత్యసుఖము నందు నీప్రాణ మింక నంత్య
మాపహించె ముస్తఫావజీర !
యింక నన్యకాంతఁ లీజన్మమునకు ఘ
టింపఁబోవు- మదిఁ గలంప రావు.

ఇంక నే నరిగెదను. ఒక్కపోటు- గుండెలలోఁ బొడిచివేయుము.

(నిష్క్రమించును.)

[చాటున సుల్తాను, వీరిసెట్టి ప్రవేశము.]

వీరి—(ముస్తఫాను చూపి) ఆవ్యక్తి యెవ్వరో గ్రహించితిరా !

సుల్తా—అరే ! ఇది మొంతచిత్రం ! నాదీ యేసం యేసినాడ్ !

వీరి—వీఁడు ముస్తఫాఖాను.

సుల్తా—అరే ! ఈడ్కి మేం మఁ పీయేస్తాం- నమ్మక్ హరాం.

(పోఁబోవును.)

వీరి—(పట్టుకొని) మీకెందుల కంతతొందర ! వానిని చంపువాడు వచ్చుచునే యున్నాఁడు. చూచుచుండుఁడు.

[వలీఖాను సుల్తాను వేషముతో కత్తితో ప్రవేశము.]

సుల్తా—(జనాంతికముగ) అరే ! అరే ! అరే !- మాకీ దిల్ గాభ్రా

హోతుందీ !- దోఆద్మీ మాదీయేమంతో వుంటాహూ !—
ఏం సౌదాగర్భాయ్?

వీరి—ఒకఁడు ముస్తఫా- ఒకఁడు వలీఖాఁ ! వీరిప్పుడు మిమ్ము చంపఁదలఁచి యొకనిరూపము నొకఁడు చూచి మీరని భ్రమించి చంపుకొందురు. చిత్రము చూచుచుండుఁడు.

ముస్త—(స్వగ) సుల్తాన్ ఆతాహై ! ఏక్ మార్ మే దో తడ్డాకర్నా-

వలీ—(స్వగ) ఖేతాఁ జోస్వాల్కా మెహర్భానీ హై- సుల్తాన్ ఖైట్రహాఁ—

(ఒకరికొకరభిముఖులగుచు గుండెలలో పొడిచి చంపుకొనుచున్నారు.)

సుల్తా—(భయకంపితుఁడై) హా ! ఖుదా ! దోఖాసే హోగియా ! మేరీ శీర్ గిర్తీహై.

(కన్నులు తిరిగి మూర్ఛిల్లును)

[చెకుముకిశాస్త్రి ప్రవేశము.]

చెకు—ఇతని నొక ప్రత్యేకమందిరమునఁ జేర్చుట మంచిది. మెళకువ వచ్చినప్పు డించుక సురారసము నిచ్చుచుందము.

(ఇద్దఱును మోసికొని పోవుదురు.)

౪వ. రంగము:—ఓడలోని మఱియొక భాగము.

[ప్రతాపరుద్రుఁడు, మంత్రి యుగంధరుఁడు, చెకుముకిశాస్త్రి, వీరిసెట్టి ప్రవేశము.]

ప్రతా—(యుగంధరుని పాదములపై వ్రాలి)

ఉ. శిక్షితుఁ జేసి, నన్ను తన శిష్యునిపోలికఁ బుత్రలీలగా
వీక్షణఁ జేసి, రాజ్యపదవిన్ నను నిల్పి, యనామధేయుగా
దక్షిణబాహుసద్మమునఁ దాలిచి రాజ్యభరంబు; నిప్డు ఫా

లాతఁడెఱుఁగనట్టి వికృతాకృతిఁ దాలిచి, బాదెనుండి సం
రక్షణఁజేసి మమ్ము; సుకరంబుగ నీసులతానుఁ గొన్నధీ
రాత్మయ పాదపద్మముల కంజలి జేసెద భక్తియుక్తులన్.

యుగం—(లేవనెత్తి) వత్సా! విచారింపకుము; అంతయు దైవకృతము. ఏదియో దుష్టగ్రహము చాలించుటవలన మన కిట్లయినది. ఇంక నీ కభ్యుదయమును- మా కానందమును- నష్టపుత్రలాభమునంది మేము కృతార్థుల మయితిమి. నీకు మంగళం బగుఁగాక!

(అనుబంధము 9)

వీరి—(మంగళహారతులను పుష్పహారములను దెచ్చి) బహుదినంబులమంగళవేషములతో నున్న వీరి కిది దృష్టిపరిహారము- (హారతులనిచ్చి, ఒక పుష్పహారము యుగంధరునకు వేయఁబోవఁగా- నాతఁడు దానిని చేతితో నందుకొనును. రెండవది పరితాపరుద్రునకు వేయును)

యుగం—(చెకుముకి వంకకుఁ దిరిగి) వత్స! చెకుముకిశాస్త్రి! ఈ కష్టఫలమంతయు నీది గాని మాది కాదు.

సీ. మా జనార్దనుఁడు నిన్ మన్నింపకను మాన
మును బొందినను చిన్నబుచ్చుకొనక
కటకు లా తురకల కనుబ్రాము వేళల
నీసుమంత తంత్రంబు వెసఁగనీక
వేశ్య నద్భుతకాంత్రివిధి వాంఛ నిల్పెడు
సదనున ధైర్యంబు చెదరనీక
అద్భుతజ్యోస్యవిద్యను మస్త్రఘాతుల
హతమార్చునెడ నేను కాడఁబోక
నేను పన్నినట్టి నిఖిల తంత్రంబుల
నెఱిఁగి నన్నుఁగూడ వెలుగుపఱచి

యవనిపతి గడించి యవనేశు బంధించి
నట్టి నీప్రతాప మలఁతి యగునె!

(పుష్పహారము వేసి)

ఇది నీకుఁ గాని నా కర్హము కాదు.

చెను—(సాష్టాంగనమస్కారము చేసి) బాలు నిట్లు బహూకరించుట తగునా? తమ తేజము ననుసరించి . నడచిన ఛాయను గాని వేఱుగాదు గదా!

యుగం—నాయనా! లెమ్ము. చిరాయుష్మంతుఁడ వగుము. ఓరుగల్లు చేరినతరువాత నీశ్రమకు ఫలం బగును. (ప్రతాపరుద్రునిఁ జూచి) వత్సా! ఈతని నెఱుఁగుదువా?

ప్రతా—నా కీయొక్క విషయమే దుర్ఘటసమస్యగా నుండెను. ఈ మహాత్ముని నే నెఱుఁగక తల్లడిల్లుచుంటిని.

యుగం—అట్లయిన వినుము.

సీ. భారతరాష్ట్రవైభవచా ్యపావనం
భవుల కొంపలను దీపాల నార్ప!
గోవిప్రసంహార ఘోరకర్మక్రియా
పరులపుచ్చులతోడ బంతు లాడ!
తురకలకుత్తుకల్ దొరలగా మొలబాటి
నల్లవాగులలోన జల్లు లాడ!
వెత జెంది కుందెను బిబ్బల నలపార
శోకంపుపొలిమేరఁ జేరఁ దోల!
ప్రతిన దాల్చియున్న భారతవీరుఁ డీ
యవనిదేవుఁ డితని యాశయంబు
నావగింజలోన నరభాగ మైనను
దీర దయ్యో! క్రోధ మార దయ్యె.

ప్రితా—ఆహాహా! ఎట్టిసచ్చరిత్రము వింటిని. ఈమహాత్ముని వీక్షణ
మున జన్మసాఫల్యము!- ఎందుల కీమహాత్మున కీచాణక్యప్రతిజ్ఞ!

యుగం—యవనకృతపరాభవము.

ప్రితా—అగును. ఇది ప్రకృతిసిద్ధము గదా!

గీ. భానుకాంతంబు ప్రాణవిహీన మయ్యు
చండరవిపాదహతులచే మండుఁ గాదె?
దళితవేదండ ముద్ధతిఁ గలఁచుఁ గాదె?
పౌరుషాఢ్యుల కిట్టిదే ప్రకృతిగుణము.

యుగం—వత్సా! చెకుమాకీ! నీకోరిక పూర్ణముగ నీడేరదయ్యె నని
విచారింపకుము.

ఉ. భారతమాత కిప్డు డశుభం బగుబానిసతోగ ముంటచే
కూరులు హీనజాతకులు కొందఱు పాలనసేతు; రింక దు
ర్వైరులనాశనం బలతివర్షము లావలఁ గల్గు; నప్పుడే
భారతజాతి కభ్యుదయవారము వైరము దీఱు నప్పుడే.

చెకు—మహామాత్యయుగంధరా! రాజకార్యధురంధరా!

ఉ. గాజులఁ దాల్చుబానిసలఁ గంటవోఱంగి స్వరాజ్యమాత, వి
భ్రాజితు లైనవారిఁ దమవంటిమహాత్ములఁ గడ్పుచల్లగా
మీాజనయిత్రివోలెఁ గని మెప్పు ఘటించునవేని దాసు లా
భూజను లుందురే భరతభూమికి రాదె స్వరాజ్య మిప్పుడే?

ప్రితా—సెబాసు! చక్కగాఁ జెప్పితివి నాయనా!

యుగం—(వీరిశెట్టినిచూచి) ఏమి వీరిసెట్టీ మాటాడవు? ఇదియంతయు
నీకష్టము- నీరాజును నీవు గొనిపోవుచుంటివి.

ప్రితా—మేమిద్దఱమును బాల్యమిత్రులము. ఆవిశ్వాసము పోనిచ్చు
కొనలేదు.

వీరి—శ్రీరామసేతునిర్మాణసమయమున నుడుతచేసిన పనిని మేము చేసితిమి

యుగం—మీకష్టములను శ్రీవారు మఱచిపోరు.

వీరి—అనుగ్రహపాత్రులము.

యుగం—సుల్తానుపరిభృతులు గాఢనిద్రలో నున్నవారు. ఈకైపు వీరికి మనయోడలు సముద్రప్రవేశము చేయువఱకునుండుము. ఆవల చూచుకొందము. ఓడలు మహావేగమునఁ బోవుచున్నవి గదా!

ఆ. తెల్లవాఱువఱకు దివ్యస్థలం బగు
వారణాశి మనకు వాసభూమి
వివిధపాపహరణ విశ్వేశదర్శన
ప్రాప్తి గలుగు బహుభవంబు తొలఁగు.

ఈరాత్రి విశ్వేశ్వరుని మూఁడుకన్నులవలె నేనును చెకుముకియు, వీరిశెట్టియుం గాచియుందుము. శ్రీవారు విశ్రమింపవచ్చును.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





శ్రీ

# ప్రతాపరుద్రీయము



## షష్ఠాంకము.

ఓరుగంటిలోని రాజభవనము.

[ఉచితాసనములపై సుల్తాను, యుగం, ప్రతా, చెకు, జనా, విద్యా, వీరశెట్టి మొదలగువారు ప్రవేశింతురు.]

యుగం—మాచాకలిపేరిగానిని మీవలీఖాను ఖైదుచేయుటచేత మేమిట్లు చేయవలసివచ్చినది. అందులకు మమ్ము సుల్తానువారు క్షమింపవలయును.

సుల్తా—చాకల్కీ పట్టీ రాజా అనిసెప్పి- మాకీ వలీఖాన్ మోసంతలిచీ తుదకీ మా ప్రాణంకూడా తిసోకటాన్కీ ప్రెవెత్నం షేచినాడ్! ఇది మాకి షాలా హవ్మానం. అదీహంతా మీహానుగ్రహంచేత తప్పిపోయి మేము బ్రదికివున్నాం. అదీకాకుండా- రాజాగారి యెదుట- యుగంధర్ మంత్రిగారియెదుట- మేంషాలా- మేమ్ యిప్పుడూ ద్రోహులూ అవినాం. ఎందూక్అంటే- మేమ్ మోసంచేయించీ రాజాకీ పట్టవాలా అనీ ప్రెవెత్నం షేచినాం. రాజావారి షేవకులూ- మాజాన్ కాచి, మమ్మల్ని షురక్షి

తంగా యిక్డా పేర్చినార్ - ఇందుక్కా వారిపాదాల్కి మలాం హాజార్ దఫాలు పేచినా మా పాపంపోదు.

(పాదములపైఁ బడఁబోవును.)

ప్రతా—(లేవనెత్తి) సుల్తానువా రిట్లు చేయఁగూడదు. సమానపాయీలో మన కీవిధమైన మర్యాదలు కూడదు.

చెకు—

గీ. యవనులగుటచేతను మీమతానుసార
ముగ నొసర్చిరి మాయెడ మోసకర్మ
భంతపుత్రుల మాట మాభావరీతి
ప్రాంచితముగ మిము బహూకరించినాము.

యుగం—చెకుముకీ! వలదు - ఆమాటలేల? ఎవరెవరికర్మానుసారముగ వారు కష్టసుఖములం గాంచుచుందురు. మనచాకలివాని కెన్నినాళ్ళు కారాబంధనము కాలేదు.

సుల్తా—మరి యింకా షోకమంమయం- మాదీత్తోవొచ్చిన దివానా బహదూర్ యెక్కడా యెల్లినార్ - మాకూ జోష్యంచెప్పిన శాస్త్రీజీ యెక్కడా యెల్లినార్ - మాకీ రత్నమరుక్కల్ అమ్మటాన్కి తెచ్చిన గోవాసౌదాగర్ భాయీ యేమి అవినార్ ?

ప్రతా—వినుఁడు.

సీ. ఉన్మాదుఁ డనుపేర నున్నధీనిధి మహా
త్ముం డితఁడె యుగంధరుండు సుమ్ము
మోసంబునను వలీ ముస్తఫాఖాన్ల, మా
యించిన చెకుముకి యితఁడె సుమ్ము
రత్నంపుసరుకు విక్రయముఁ జేసెద నన్న
తఁడు వీరిసెట్టి యాతండె సుమ్ము

ము_స్తఫాఖానును మోసగించిన ఫాతి
మాబీబి చెకుముకిమహిళ సుమ్ము
మీరు చెఱఁగొన్న చాకలిపేరిగాని
బడయుటకు నిట్టు లజ్ఞాతవాసదీక్ష
నిర్వహించి కృతార్థులై నెగడినారు
విదితమేధావిధానంబు వెలయ వీరు.

సుల్తా—(మహాశ్చర్యముతో) అరే! అరే! అరే! యుగంధర్వారూ మర్గయా అవినార్ అనీ పుకార్- దివాన్కీ- సూసీమేం దివానా అవినాం.

ప్రితా—వీరే యుగంధరులవారు.

సుల్తా—మీరు- హల్లా కాని మన్సీ కారు.

(సలాముచేయును.)

యుగం—మఱియిప్పుడు మా దొకమనవి యున్నది.

ఆ. సేవఁ జేసె మీకు చెకుముకి కొన్నినా
ళ్లి తనినోట మాంసమిడిరి తురక,
లందువలన సీతఁ డాగ్రహమున నింత
జేసి మిమ్ము బంది జేసినాఁడు.

కావున నింక గోబ్రాహ్మణబాలాబలావిలాపంబులకు మీరాజ్యంబునఁ దావీయవలదని మా ప్రార్థన.

సుల్తా—ఇది మేం హావమ్యం మా రాజ్యంలో మన్నా షేయిస్తాం. అదీ కాకుండా- మాదీ గ్యాపకంకోసం మీదగ్గఱ మాతర్వార్ వుంచవాలా కూడా కోర్తాం. (ఇచ్చును.)

ప్రితా—(పుచ్చుకొని) ఇందువలన మేమును మీరును చిరమిత్త్రులమైతిమి. మీరును మాజ్ఞాపకార్థ మీరత్నహారము నుంచుఁడు.

(హారము వేయును. అందఱును కరతాళము లొసర్తురు.)

సుల్తా—మరి మేం కొంచెం సేపు విశ్రమిస్తాం.

యుగం—వీరిశెట్టీ! సుల్తానువారికి విడిది చూపుము. రేపు వీరిని తగు పరివారముతో ఢిల్లీకి ప్రయాణము చేయింపుమని భేతాళ రావుతో చెప్పుము.

(అందఱు అన్యోన్యము సలాములైనపిదప సుల్తాను వీరిశెట్టి నిష్క్రమింతురు)

యుగం—(జనార్దనునితో) జనార్దనా! నీవు గనినుండి తీసిన జాతి రత్నమును గుర్తింపలేక చేజార్చితివి. మేము సానపెట్టితిమి. ఇప్పుడుచూడు మెట్లు ప్రకాశించుచున్నదో (చెకుముకిని చూపును)

జనా—ఆర్యా! గరుత్మంతునిదృష్టి గ్రద్దలకుఁ గల్గునా?

[వీరిసెట్టి ప్రవేశించును.]

వీరి—అంతయు సెలవుప్రకారము చేసితిని.

ప్రతా—(విద్యానాథుని చూచి గుర్తించి) ఆహా! ఏమి నాభాగ్యము. మహాకవి విద్యానాథులవారేనా?

(నమస్కరించును.)

యుగం—మహాకవియే కాదు—మహారాజ మంత్రికూడను.

విద్యా—మహామంత్రివారి యనుగ్రహము.

ప్రతా—మహాత్మా! కుమార్తె వివాహమైనదా?

విద్యా—అల్లుఁడు ఢిల్లీలోనున్నందున వచ్చువఱకు నిలిపియుండవలసి వచ్చెను.

ప్రతా—ఇప్పుడు రాలేదా?

విద్యా—అట్లయిన కల్యాణమున కిదియే సుముహూర్తము.

"తదేవలగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ॥

బాహాబలం దైవబలం తదేవ
విద్యాబలం బుద్ధిబలం తదేవ॥"

(అక్షతల నిడి గ్రంథము సర్పించును. రాజు నమస్కరించును.)

(వాద్యములు మ్రోగును.)

ప్రతా—అంతటను వానినే తగులవేసితి నంటేరే..........

విద్యా—చూడుడు! ప్రతిశ్లోకమున నానామమే తగిలియున్నది.

ప్రతా—మహాకవుల వాక్యము! అస్థితియందా యర్థము- ఈస్థితియం దీ యర్థము.

యుగం—(రాజునకు కొన్ని శాసనముల నిచ్చును.)

ప్రతా—మాకొఱకై మీరందఱు నమితశ్రమ నందితిరి. అందులకు ఫలితముగా- శ్రీయుగంధరులవారు యాత్రాసేవనము చేసి విశ్రాంతి నందుడలచినందున- శ్రీజనార్దనమంత్రి యగ్రామాత్యుడు- విద్యానాథులవారు రెండవమంత్రి- చెకుముకిశాస్త్రి గారు మూడవమంత్రి- వీరిసెట్టికి పరగణా జాగీరు బహుమానము-చాకలిపేరిగానికి చాకలినాయకుడుగా నధికారము- భూదానము ధనదానము.

(అందఱకు శాసనముల నిచ్చును.)

అందఱు—మహాభాగ్యము (కన్నుల కద్దుకొందురు)

యుగం—హిందూసుందరియయ్యు రాజసేవకై-పతియాజ్ఞ ననుసరించి-ఫాతిమాబీబీ వేషముదాల్చి ముస్తఫాకంట దుమ్ముగొట్టిన మహోపకారిణి- చిరస్మరణీయ వీరనారీమణియగు చెకుముకి శాస్త్రిగారి వేశ్యయగు శ్రీశ్యామలాదేవి కంతఃపురమున సన్మానములగుగాక! ఇంక రాజేంద్రునకు మాతృపూజా సమయము. వత్స! ప్రతాపరుద్ర! నీ కింకేమి కావలయును.

# అనుబంధములు.



1 యువరాజు.

బ్యాన్—త్రిశ్రగతి.

భీకరముగ మనవైరుల- పీచ మణంచెనుఁ గనుఁడు
నాకాధిపుఁ డెమ్మైనన్ - లోకాధీశ్వరు లదరఁగ॥ భీ॥
తురకల శిరములు దఱుగగ - త్వరపడ నాగుణనిధాన
అరమర నరయక బయువడి - నరిగిన వదలుము బిరాన॥ భీ॥

2 ప్రతాపరుద్రుఁడు.

కాఫీ—ఆది.

ప॥ ఏమో కానగ - మెఱుఁగఁబడకు నా
కీతురకలు నొనరించెదు కార్యము॥ లేమో॥
అ॥ ప॥ ఈమహితలము - నిపుడు జయింపఁగ
నెంచిరో కపటము - గాంచిరో మనముల॥, నేమో॥
చ॥ పురమున కిపుడే - పౌరపులు గలుగునొ
తురకలచందము - దోప దేమార్గము
మరలఁడుగా మా - మంత్రిప రేణ్యుఁడ
పారతంత్రిమతిన్ - ధన్యచరిత్రుఁడు॥ ఏమో॥

3 ప్రతాపరుద్రుఁడు.

లతాంగి—ఆది.

ప॥ ఈశ్వర సంకల్పము, కనఁ (ని॥ ఈ॥)
నే- వార తెలియుగుడు రారయ సీభువి
నేరయినను మాగూ - వారిధ గూలఁగ॥ నీశ్వ॥
చ॥ ఒకచోట నవ్వించు - నొకచోట నేడ్పించు
నకళంకమైనదిగా - సుఖదుఃఖమయమైన

ఆపాప రహితుని మోసంబున బంధించువాని
శిరములు తోరణము లొనర- జేసెన - నబ్ధిని- దోసెన॥ ఇం॥

7 శ్యామల.

సారంగ్ — ఆది.

ప॥ నీదరిశనమే నిఖిలపాపహరము॥ నీ॥
అ॥ ప॥ నాదయితుండ నీ - వేదైవ బవు॥ నీ॥
చ॥ పతియానతి మీరిన గతి సతులకు
క్షితితలమున గలదే హృదయేశ్వర
హితమతి శిరమున సేవనియైనను
సతము ధరించుట సంతోషమునుగద॥ నీ॥

8 చెరుముకి శాస్త్రి

రాగమాలిక.

(బలే మంచి చౌక బేరము — వలె)

మాయామాళవగౌళ — రూపకం.

బలే మంచి రాజ్యతంత్రిమూ - ఈమంత్రిమూ
పాలిసీ వధుం డౌను - వగీఖాను॥ బలే॥

శ్రీరంజని — రూపకం.

హృద్యమైన మంత్రిమూ - అభేద్యమైన మంత్రిమూ
సాధ్యాసాధ్యం బిడి యనవద్యమైన మంత్రిమూ
ఆద్యంతము లరయరాని యనుపమానమంత్రిమూ
తురకల- శిరములు- గొరుగుట- కెవ్వెవ్వె- దొరకె నాకు॥ బలే॥

నాథనామక్రియ — రూపకం.

ముస్తఫా వలీ భుజంగ - ములనణంచు మంత్రిమూ
నిస్తులం బనేకజనా - నీకహారణమంత్రిమూ

మస్తకముల బాతులాడు- మారణతిరుమంత్రిమూ
హాస్తములనుబడియె సుప్రి- శస్త్రముగ బు- ధస్తవముగ॥ బలే॥

సారంగ—రూపకం.

సారమైన మంత్రిము - సువిచారమైన మంత్రిము
వైరివీరనికరహారమ - వారణ మగు మంత్రిమూ
ధీరయుగంధర రచితా - పారమైన మంత్రిమూ
ఆగయ నిది యోరుగంటి- కభ్యుదయము - మహాహ్లాదయము॥

యుగంధరుడు.

హిందోల్—ద్రుపద.

చ॥ శ్రీమదఖండరాజ్యలక్ష్మీ విభవోస్తు - శుభమస్తు॥
అ॥ ప॥ రామరాజ్య సమవిభవ రాజితాఖిలాశాధరణ। శ్రీ॥
చ॥ శ్రీకరముగ సూయలకును - భీకరముగ వైరులకున్
ప్రకటముగ- లోకము నను- బాలింపుము- లోలింపుము॥ శ్రీ॥

10 అందలు

(మంగళము)

బ్యాన్—త్రిశ్రిగతి.

మాధరధర - ముంగళకర - మాంగళంబు రా
మారిసుందరా - శ్రీరమేశ బోవరా॥
దాసభరణ - దోషహరణ దానవేశనాశా
రాజరా - జేశ్వరా- యోపరాత్పర
శ్రీనివాస జగదీశ్వరా -
శ్రీరమా నాయకా - జగన్నాయకా॥ మంగ॥

సంపూర్ణము.



# ఆంధ్ర నాటకములు

| | రూ. | అ. | | రూ. | అ. |
|---|---|---|---|---|---|
| కనకతార నాటకము చం॥ కే॥ | 1 | 4 | గయోపాఖ్యానము చి॥ ల॥ | 0 | 8 |
| కృష్ణలీల బళ్ళారి కుం॥ కు॥ | 1 | 8 | ప్రసన్న యాదవము డిటో | 0 | 8 |
| లవకుశ బళ్ళారిది డిటో | 1 | 8 | పారిజాతాపహరణము | 0 | 8 |
| కన్యాశుల్కము గు॥ అ॥ | 1 | 0 | చతురచంద్రహాస డిటో | 0 | 8 |
| కోమవార కో॥ స్తు॥ | 1 | 4 | పార్వతీపరిణయము డిటో | 0 | 6 |
| తులసీదేవి ను॥ చె॥ | 1 | 0 | స్వప్నవాసవదత్త డిటో | 0 | 6 |
| బొబ్బిలి యుద్ధము శ్రీ॥ కృ॥ | 1 | 0 | పాండవ జననము రా॥ నా॥ | 0 | 10 |
| రసపుత్రవిజయము ఇ॥ యు॥ | 1 | 0 | పాండవ ప్రవాసము డిటో | 0 | 12 |
| రాణాప్రతాప్ సింగ్ డిటో | 1 | 0 | పాండవోద్యోగము డిటో | 0 | 12 |
| భక్తరామదాసు కే॥ శి॥ | 1 | 0 | పాండవవిజయము డిటో | 0 | 12 |
| రామదాసు బళ్ళారి డి॥ గో॥ | 1 | 0 | పాండవాశ్వమేధము డిటో | 0 | 12 |
| రామదాసు రా॥ నా॥ | 1 | 0 | అహల్యా శాపవిమోచనము | 0 | 12 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 2 | ద్రౌపది వస్త్రాపహరణము | 1 | 0 |
| చింతామణి చ॥ మా॥ | 1 | 0 | సంపూర్ణరామాయణము గు॥ కో॥ | 1 | 4 |
| చింతామణి రా॥ నా॥ | 1 | 0 | సంపూర్ణరామాయణము కో॥ స॥ | 1 | 4 |
| వైరాగ్యచింతామణి బు॥ కో॥ | 1 | 0 | సంపూర్ణభారతము ఓ॥ వ॥ | 1 | 4 |
| కంఠాభరణము పా॥ ల॥ | 1 | 0 | మహాభారతము సం॥ శిం॥ | 1 | 4 |
| రాధాకృష్ణ డిటో | 0 | 10 | సంగీత కృష్ణలీల డిటో | 1 | 0 |
| సావిత్రి శైలవరంవారు ప్రదర్శించేది శ్రీ॥ సు॥ | 1 | 2 | అర్జున ప్రతిజ్ఞ వ॥ వెం॥ | 0 | 12 |
| | | | భీమప్రతిజ్ఞ క॥ కో॥ | 0 | 12 |
| సత్యహరిశ్చంద్రీయము బు॥ ల॥ | 1 | 2 | భీష్మప్రతిజ్ఞ అ॥ శే॥ | 0 | 12 |
| బుద్ధిమతీవిలాసము డిటో | 1 | 0 | మోహినీ రుక్మాంగద డిటో | 0 | 12 |
| ఉత్తరరాఘవము డిటో | 1 | 4 | రాణీసంయుక్త డిటో | 0 | 8 |
| సాత్రాజితీయము | 0 | 14 | భక్తకబీర్ కో॥ సు॥ | 1 | 0 |
| మహానంద బు॥ కో॥ | 1 | 0 | పాదుకాపట్టాభిషేకము దో॥ సీ॥ | 0 | 12 |
| జయంత జయపాలము | 0 | 12 | లంకాదహనము | 0 | 10 |
| వేణీసంహారము వ॥ సు॥ | 1 | 0 | వేశ్యాహితబోధిని డిటో | 1 | 0 |
| శకుంతల కం॥ వీ॥ | 1 | 0 | వేశ్యావధూగం పా I | 1 | 0 |
| శకుంతల వే॥ సు॥ | 1 | 0 | డిటో పా II | 0 | 13 |
| ఆలీబాబా క్రొత్త నాటకం సో॥ రా॥ | 0 | 12 | డిటో పా III | 0 | 8 |
| శ్రీరామ పట్టాభిషేకము జ॥ ల॥ | 1 | 0 | సురాజుద్దౌలా జ॥ ల॥ | 0 | 8 |

వేయువారు:— కురుకూరి సుబ్బారావు,
బుక్ సెల్లరు అండ్ పబ్లిషర్, భీమవోలు, పశ్చిమ గోదావరి జిల్లా.

ఆలీ బాబా అను

# అదృష్టవిజయము.

[శ్రీయుత సోమరాజు రామానుజరావుగారు.]

"అన్యాయార్జితమగు ధనము నారికేళమందలి జలమువలె హరించిపోవు" ననుటకీయాలీబాబా కథ ప్రమాణము. అదృష్టము రెక్కలు విప్పుకొని యెగురుచున్నది. అది యిచ్ఛామాత్రమున వ్రాలును. వ్రాలినచోటలక్ష్మి తాండవించుచున్నది; దరిద్రుండగు నదృష్టగుప్తునిపై నదృష్టదేవి తన పక్షచ్ఛాయం బఱపుచున్నది. అనంత ధనసంచయములను మహారణ్యములందు గూర్చియుంచిన, మైరావణ మహాచోరుని యదృష్టము తారుమారైనది; రహితమగు మహావిప్లవము పాతాళగుహాయందు బయలుదేరినది. "జయితిలో త్తమా" యనుటలోడనే, గుహాతలము పటాలున బ్రద్దలగుచున్నది. అందలి రత్నరాసులకు కన్నులు దిగ్భ్రాంతములైపోయిన లోభగుప్తుని మృత్యుదేవి వరించినది; చోరులచే వానిని శవఖండములు గుహకుఁ గట్టఁబడినవి. కథాప్రవాహమున రక్తధారలంతర్వాహినులై పారుచున్నవేళల చదువరుల గుండెలు ముందేమగునో యని కొట్టుకొనువేళ- "చతుర" యను చతురవ్యక్తి రంగమున దృశ్యమైనది; మొగమునమందహాసము-ఒడిలో చంద్రహాసము; బహిర్గతమున నతిసుప్రశాంతిదేవము-అంతర్గతమున శాత్రవప్రతీకారరోషము—ఇట్టిబహిరంతర్విరోధభావములతో నిపాత్ర త్రివిధస్వరూపము దాల్చి, యదృష్టగుప్తరక్షణమునకై పనిచేయసాగినది! చతుర భీకరకాలాంధకార మధ్యమునఁ గటారిచేఁబూని 40 నూనెబుంగలలో దాగిన దొంగలను భంగపరచినది. ఆశాభంగమైన మైరావణుఁడు చతురం గని భయకంపితుఁడై పలాయనమంత్రముం బఠనము చేసినాఁడు—ఉక్కుమాలిన గుహాంగని, మైరావణుఁడొనర్చిన రోదనమునకు దిశాతలములు ఛేదిల్లినవి. తుదసారి ఘూర్జితమనోహంకారముతోడ, నాయకుఁడై రావణశక్తి హాస్యరంగమున మునివేషముతోఁ బ్రవేశించి, కాలసర్పమువలె నదృష్టగుప్తునింటఁ దూరెను. చతురవాని యాగడ మెఱిఁగినది. కాత్రివప్పావయు విభేదనశీలయగు నా నాటీరూపశ్శైరవి, నాట్యమందిరముం బ్రవేశించినది. నటనమున కపటము—నృత్యమున హాస్య-మధనమున రుధిరము-పాపము బ్రద్దలయ్యెను. బహుదినములనుండి దాగినదొంగ హతమైనాఁడు. సర్కారువారు శ్రీమతి చతురాదేవియని యామెకు బిరుదు నిచ్చుటతో-చతురాదృష్టగుప్తుల కరములయందలి పూలదండ నన్యోన్య కంఠాలంకృతమొనర్చుటతో- సకలజనానందముతో- కరటకదమనకుల హాస్యములతో, రేచుక్కపగటిచుక్కల యుక్తిప్రయుక్తులతో, గథామంగళరంగము పరిసమాప్తమగుచున్నది. ఎచ్చటఁ జూచిన రసముప్పతిల్లుచుండును. అనేకసీనులు ప్రదర్శింపఁబడెను. స్వరములతోనున్న పాటలు. ప్రయోగ సౌలభ్యముగల నాటకరాజము. త్వరపడుఁడు. వెల 1—0—0

---

వలయువారు—కురుకూరి సుబ్బారావు, బుక్కుసెల్లర్, భీమడోలు.

